శ్రీ ర స్తు.

# అద్వైతానంద బోధిని.





ఇయ్యది,

శ్రీ. శ్రీ. శ్రీ. కాంచీ కామకోటి పీఠాధిష్ఠిత శ్రీమచ్చంద్ర
శేఖరేంద్ర సరస్వతీస్వామి ప్రణీతము.

—: సంపాదకుఁడు :—

తూళ్లా, విశ్వనాథ శాస్త్రి.

ప్రథానాంధ్ర పండితుఁడు, పచ్చయప్ప పాఠశాల, చెన్నపురి.

---

: ప్రకాశకులు :

టి. బి. మెహాతా అండు సన్సువారు.

రత్నవర్తకులు, పార్కుటవున్, మద్రాసు.

 1933

శ్రీరస్తు.

'అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా,
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః.'

## —: అంకితము :—



ఈ గ్రంథము
శ్రీ కాంచీ కామకోటి పీఠాధిష్ఠిత
శ్రీ. శ్రీ. శ్రీ. చంద్రశేఖరేంద్ర
సరస్వతీస్వామి దివ్య
చరణ సరసిజము
లందు సమ
ర్పింపఁ
బడిన
ది.

'సంపాదకుఁడు'



శ్రీమదాదిశంకర భగవత్పాదులు.
శిష్య చతుష్టయ సహితులు.

# విషయసూచిక

పుట.

ప్రథమ ముద్రణము. 1000, ప్రతులు.

శ్రీ చంద్రమౌళీశ్వర.

श्रीचन्द्र
मौळीशाय नमः
श्रीमत्परमहंसपरिव्राज
काचार्य श्रीमच्छङ्करभगवत्पाद
प्रतिष्ठित श्रीकामकोटि
पीठाधीश्वर श्रीम
च्चन्द्रशेखरेन्द्रसरस्वती
संयमीन्द्रो
विजयते।

స్వస్తి శ్రీమదఖిల భూమండ లాలంకార త్రయస్త్రింశత్కోటి దేవతాసేవిత, శ్రీ కామాక్షీ దేవీ సనాథ, శ్రీమదేకామ్రనాథ, శ్రీ మహాదేవీసనాథ, శ్రీ హస్తిగిరినాథ, సాక్షాత్కార పరమాధిష్ఠాన సత్యవ్రత నామాంకిత కాంచీ దివ్యక్షేత్రే, శారదామఠ సుస్థితానాం, అతులిత సుధారస మాధుర్య కమలాసన కామినీ ధమ్మిల్ల సంఫుల్ల మల్లికామాలికా నిష్యంద మకరంద ఝురీసౌవస్తిక వాఙ్నిగుంభ విజృంభణానంద తుందిలిత మనీషి మండలానాం, అనవరతాద్వైత విద్యా వినోద రసికానాం, నిరంత రాలంకృతీకృత శాంతి దాంతి భూమ్నాం సకల భువనచక్రప్రతిష్ఠాపక శ్రీచక్రప్రతిష్ఠా విఖ్యాత యశోలంకృతానాం, నిఖిల పాషండషండకంటకోద్ఘాటనేన విశదీకృత వేదవేదాంతమార్గ షణ్మత ప్రతిష్ఠాపకాచార్యాణాం, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య జగద్గురు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యాణాం, అధిష్ఠానే సింహాసనాభిషిక్త శ్రీమన్మహాదేవేంద్ర సరస్వతీ సంయమీం

ద్రాణాం, అంతేవాసివర్య శ్రీమ చ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదైః, శ్రీమత్సమస్త సద్గుణమణిగణ రత్నాకరాయమాణానాం, హరివక్షోరంగ నటీకటాక్ష విక్షేప కోశసదనానాం, సంకీర్ణ సదసదర్థ క్షీరాంబుమిథో వివేచనా రచనే నిజదేశికేంద్ర సుయశశ్చంద్ర సముల్లాసనే ధర్మపక్షాణాం, స్వశాస్త్రవిహిత నిత్య కర్మానుష్ఠాన కనిష్ఠీకృత వసిష్ఠాది ఋషిగరిష్ఠానాం, సకల జనస్వాభిలషిత సౌఖశాయనిక స్వర్గాపవర్గ సుఖ నిర్వాహక నిత్య నిర్దోష నిసర్గ సిద్ధ నిరవధిక వివిధ నిరుపమ నిరతిశయ నిజైశ్వర్య నిదానభూత శ్రీ చంద్రమౌళి చరణారవింద మకరంద సుధాస్వాదనానంద తుందిలితాంతఃకరణ సమేధితానాం, సమ్యగధిగత వేదవేదాంగాద్యనవద్య విద్యారాశి వైశద్య విద్యోతమాన మానసానాం, సకుతూహలస్నేహ బహుమాన బహుళీకృత బహువిధ గురుశుశ్రూషా విశేష సంతోషిత మనఃప్రసాదానాం, నిఖిల మర్యాదా సంరక్షణ దీక్షిత పరమకారుణిక మను ముఖ నిఖిలముని రచిత వచననిచయ సురుచిర పరిచయ సముచిత పరిపాక ప్రకాశ విజ్ఞాన వైభవానాం, చెన్నపత్తనస్థాశేష ఘూర్జర మహాజనానాం, సర్వాభీష్ట సిద్ధ్యై క్రియతే నారాయణ స్మృతిః.

వయమిహ కుశస్థలీ పంచగంగా సంగమతీరస్థ గౌతమాశ్రమ (బుగ్గ) క్షేత్రే త్రికాల సమభ్యర్చ్య మాపశ్రీ—స్వామి చరణారవిందాః. అనవరతాద్వైత విద్యా వినోదసంజనితానంద తుందిలితాంతః కరణాః సుఖ మాప్రహే.

మీయొక్క వినయాది గుణ సంపత్తులును, దేవబ్రా

హ్మణ గురుభ క్తియును, మీరు మఠమునందు పూర్ణాభిమాన ముంచి జరిపించుచుండు మర్యాదలును, మీయొక్క సచ్చరి త్రంబులయిన గుణాతిశయంబులన్నియు, అచ్చటినుండి వచ్చు జనముఖమున శ్రుతమై మనస్సునకు చాల సంతోషముగ నున్నది. విశేషస్తు. సంస్థానం ఆ ప్రదేశములలో నుండు తీర్థం బుల స్నానార్థముగను, క్షేత్రముల స్వామి దర్శనార్థముగను, మఠం శ్రీ స్వామిపూజా బ్రాహ్మణ సంతర్పణాదులను, వితరణగ జరిపించి, అందువలన గల్గు దిగంత విశ్రాంతకీర్తి ప్రతిష్ఠలను, సుకృత ఫలములను, మీరు పొందవలయునది. స్వతఏవ ఆసేతు హిమాచల పర్యంతం ప్రసిద్ధంబుగనుండు శ్రీ కాంచీ కామకోటి పీఠంబునకు ముఖ్య శిష్యులుగ ఉండు కొని, సకల స్మార్త ధర్మములను విశదంబుగ నెఱిగి జరిపించు చుండు మీవంటి అభిజ్ఞులకు విశేషంబుగ వ్రాయింపఁదగిన దేమి ఉన్నది. తక్కిన వర్తమానంబు లన్నియు మఠం, సుబ్ర హ్మణ్య దీక్షితుల ముఖవచనంబువలన విశదంబౌను. మం త్రాక్షత విభూతి కుంకుమ ప్రసాద మంపఁబడియున్నది. నారాయణ స్మృతిః.

---

1932 సం. సెప్టంబరు నెల 9 వ తేదికి సరియగు శ్రీమదాంగీరస భాద్రపద శుక్ల దశమీ శుక్రవారమున శ్రీవారి శ్రీముఖమును శ్రీ ఘూర్జర ఖేడాబ్రాహ్మణ శిరోభూషణులగు శ్రీయుతులు, టి. బి. మెహతా అందు సన్నవారికి అనుగ్రహించిరి.

# భూమిక.

'ఎఱుకగల వారి చరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠిఁ ♦ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగిన దానిని
మఱవ కనుష్ఠించునది స ♦ మంజస బుద్ధిన్.'

(శ్రీమహాభారతము.)

శ్రీమంతంబగు మన భరతఖండమునఁ బూర్వ మొక ప్పుడాస్తికత తొలఁగి నాస్తికత ప్రబలుచుండఁగా, పరమ కారుణికమూర్తియగు శ్రీపరమేశ్వరుఁడు శ్రీమదాది శంకర స్వరూపమున నవతరించి వైదికమతము నుద్ధరించె నన్నుట యెల్ల రెఱింగిన విషయమే. ఇటువంటి భగవదవతారకారణ మునే భగవద్గీతయు మనకు,

'యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య దాత్మానం సృజా మ్యహం'

అను శ్లోకముచేత తెలియపఱచుచున్నది. శ్రీమదాది శంకరభగవత్పాదులు కేరళదేశములోని కాలటిగ్రామమున జనియించి, తాము జీవించియుండిన యత్యల్పకాలముననే వేద వేదాంగములలోని గూఢార్థము లోకమున కెఱిఁగించుటకై లెక్కకు మిక్కుటములగు గ్రంథములను రచియించి, నానా దేశసంచారముచేసి, పాషండమతముల నన్నింటిని మాపు మాపి, అద్వైతరూపములగు షణ్మతములను స్థాపించిరి.

మహాత్ములకు జగత్తే కుటుంబము కదా? వారికి లోకోపకారము సేయుటకంటె వేఱుకార్యమేమి యుండును? ఇటువంటి లోకోత్తరమగు అద్వైతమతముయొక్క ప్రశస్తిని చాల వఱకు గ్రహించినవారు కనుకనే పాశ్చాత్యులు సయితము శ్రీమదాది శంకరభగవత్పాదుల యద్వైతసిద్ధాంతములను తమభాషలోనికి తర్జుమాచేసికొని చదువుచున్నారు. ఇందుల కింతకంటె వేఱు నిదర్శనము కావలయునా? కాని, కలిజుష్టమగు నిక్కాలమున మన 'వేషభాషలు సయితము మాఱిపోయి, తుదకు మనమెందులకును కొఱగాని స్థితినిబొందుదుమేమో?' యను సంశయము వివేకియగు ప్రతిమానవుని మనస్సునను నాటుకొనుచున్నది. ఇందుల కనేక కారణములు కలవు. కాని, ఒక్క కారణమును మాత్ర మిచట తెలుపవచ్చును. ఏ మందురా? 'స్వమతమును ద్వేషించుట, పరమతమును శ్లాఘించుట' అను రెండు విషయములు ఈనాటి వారమయిన మనయందు ఒక ఆచారముగ పరిణమించినవి.

'స్వయంతీర్ణః పరాన్ తారయతి' యను నార్యోక్తి చొప్పున, కృతార్థులయిన పెద్దలు మనలను చేయివిడుచుట లేదు. 'మనము కృతార్థుల మైతిమి గదా? యీ లోకముతో మన కేమి పని?' యని వా రూరకుండరు. ఈ లోకమంతయు, తమవలెనే కృతార్థత నందవలయునని వా రాశించుచుందురు. ఆశించుట మాత్రమేనా? ఊరూర సంచరించుచు అంధకారమున మునిఁగియున్న లోకమును మేల్కొల్పుదురు. అంతటితో విడుతురా? తా మాచరించిన సకలధర్మములను లోకముచే నాచరింపింతురు. కావుననే కదా? వారియ

దాచార్యశబ్దము సార్థకతను బొందినది. అందువలననే కదా? వేదములును 'ఆచార్యదేవోభవ' యని మొఱబెట్టుచున్నవి. ఈ కారణముననే మన యాది శంకరులును జగద్గురువు లయిరి.

శ్రీమదాదిశంకరులు తమమతము ఆచంద్రార్కముగ నీ భరతభూమియందు నెలకొనియుండుటకై, అందందు మఠముల నిర్మింపించి, ఆ యా పీఠములందు, తమ శిష్యుల నునిచి కైలాసము నలంకరించిరి. అటువంటి పీఠములందు మనము శ్రీ శృంగగిరి పీఠమును, శ్రీ కామకోటి పీఠమును మిక్కిలిగ వినుచున్నాము. యోజించి చూచినయెడల నీ రెండు పీఠములందును మఱల శ్రీమదాది శంకరుని యంశము అవతరించెనని చెప్పవలసియున్నది. ఎట్లందురా? మఱల నీ రెంటి యందును సర్వజ్ఞత్వము విరాజిల్లుచున్నది. ఇంతకంటె వేఱు తార్కాణమేల? అన్నిటి యందును మానవుని నమ్మకమే గదా? ఫలవంత మగుచున్నది. 'భక్తిగల్గుచోట ఫలమిచ్చు దైవం' బని విరాగిచక్రవర్తి యగు వేమనగూడ చెప్పియుండెను గదా? ఇంతయేల? నేఁటి కామకోటి పీఠాధిపతుల ముఖవికాసమును వారి సర్వతోముఖపాండిత్యమును ఈ విషయమును చెప్పకయే చెప్పుచుండును. దీనిని గూర్చి అల్పవిషయామతులు వ్రాయఁగడంగుటయు పరిహాసభాజనమే యని నా యభిప్రాయము. కాని, యథామతిగానైన వ్రాయక తీఱదని వ్రాసితిని. శ్రీవారికిఁగల శిష్యవాత్సల్యమును అగణ్యమనియే చెప్పవలసియున్నది. భగవదంశసంభూతుల కిది స్వభావసిద్ధమగు గుణమేకదా? ఇదియునుంగాక, వారి

యుపన్యాసములును ఈ విషయమును సూచింపకపోవని నా విశ్వాసము. ఇఁక ప్రస్తుతమునకు వత్తము.

శ్రీ కామకోటి పీఠాధిపతులు శిష్యసంచారము చేయుచు మద్రపురి కరుదెంచిరి. సుమారు రెండు మూఁడు మాసములకాలము మైలాపూరు, సంస్కృతకళాశాల యందు విజయముచేసి భక్తకోటి ననుగ్రహించుచుండిరి. ఇట్లుండ, శ్రీవా రొకదినమున ఏకామ్రేశ్వరాగ్రహారమున నుండు ఘూర్జర బ్రాహ్మణ బృందమునకు తమరాక నెఱింగించుచు ఒక శ్రీముఖమును బంపిరి. దానిని జూచి శ్రీయుతులు, టి. బి. మెహతా అందు సన్నువారును (డైమండు వర్తకులు) టి. ఆర్. ఠాకరు అందు సన్నువారు, ఆర్. ఆర్. జోషి అందు బ్రదర్సువారును, కే. సుబ్బరాయ తరవాడిగారు రాజారామ శుకల్ గారును, నృసింహశాస్త్రులవారును తదితరు లయిన గుజరాతి ఖేడా బ్రాహ్మణులందఱు సమావేశమయి శ్రీవారిని శ్రీ ఏకామ్రేశ్వరాగ్రహారమునకు ఆహ్వానించి భిక్షలు, పాదపూజలు మున్నగు సేవలు జరిపి కృతార్థత నందవలయునని తీర్మానించిరి. వారి ప్రార్థనము నంగీకరించి శ్రీవారు కడచిన డిసంబరు నెల 14-వ తేది రాత్రి పది గంటలకు మైలాపూరునుండి బయలుదేరి సకల పరివారముతోడ ఏకామ్రేశ్వరాగ్రహారములోని శ్రీయుత. గోకుల్ దాసు, జమ్నాదాసుగారి 'శ్రీ గోవర్ధనభవనమున' విజయంచేసిరి. అది మొదలు సుమారు ఇరువది దినములు శ్రీవా రగ్రహారముననే వేంచేసి యుండిరి. రాత్రి పూజానంతరము దివ్యమగు తమ వాగ్ధోరణితో ఉపన్యాసములను గొన్నింటి నను

గ్రహించిరి. తొలుతటినుండి శ్రీవా రొనర్చుచుండిన యుప న్యాసముల నన్నింటిని నేను సంగ్రహముగ వ్రాసికొనుచుంటిని. తర్వాత, వానిని 'ఆంధ్రపత్రిక' యందు ప్రకటింపించిన లోకోపకారకముగ నుండునని తలంచి యట్లొనరించితిని. తదధికారులును నా ప్రార్థనమున కియ్యకొని వానిని తమ పత్రికయందు ప్రకటించుచుండి రందులకు వారియెడ నేనెంత యు కృతజ్ఞతఁ జూపవలసియున్నాను. పిమ్మట నొకకొన్నిదిన ముల 'కీ యుపన్యాసముల నన్నింటిని గ్రంథరూపమున మన మేల వెలయింపఁ జేయరాదని' నాకొక యాశయము జనించి నది. అయిననేమి? బహుళ ధనవ్యయ ప్రయాసములచే కాఁదగిన కార్యము ఇది. నేనెట్లు చేయఁగలను? ఎట్టకేలకు మాబడియందలి విద్యార్థులు శ్రీమంతులు, చిరంజీవులు టి.బి. గోపీనాథ ఠాకరు, యమ్. రామరత్నదాసు, అను నిరువురకు నాయాశయమును జెప్పితిని. 'మాశక్తికి వంచనములేక యీ సత్కార్యమునఁ బాల్గొందు' మని, ఒక్కవారము దినముల లోపల నలువది రూప్యములను చందాలవలన వారు వసూలు చేసి తెచ్చియిచ్చిరి. ఈ మొత్తమునకే యుపన్యాసములు పుస్తకరూపమును ధరియింపఁగలవా? మీఁది కార్యమును 'ఇదమిత్థ' మ్మని నిర్ణయింపలేక తుదకిట్లు చింతించితిని. 'బహుళ ధనవ్యయ ప్రయాసముల కోర్చి శ్రీవారిని ఏకామ్రే శ్వరాగ్రహారమున కాహ్వానించి జన సామాన్యమున కంత కును శ్రీవారి దర్శన తీర్థసేవనాది భాగ్యమును ఘటియింపఁ జేసిన శ్రీ. టి. బి. మొహంతా అందు సన్నువారితో యోజిం తము గాక!' యని నిశ్చయించికొంటిని. ఇప్పటికే నా మన

న్నున నుండిన విచారమునందు సగపాలు తొలఁగిపోయినది. ఆవల నొకనాఁడు శ్రీయుతులు, టి. బి. రంగనాథ మెహతా గారితో నాయాశయమును నివేదించితిని. వారు నా మనవిని శాంతముగ విని 'పుస్తకము నచ్చొత్తింపుఁడు, శ్రీవారి ఛాయా పటములను సయితము పుస్తకమునఁ జేర్పుఁ డని' యానతిచ్చిరి. వారి యభయప్రదానముననే యీ యమూల్యోపన్యాసములు గ్రంథరూపమును ధరించిన వని పాఠకులీక సులభముగ గ్రహింపక పోవుదురా?

> 'కర్తా కారయితా చైవ ప్రేరక శ్చాను మోదకః,
> పాపకార్యే పుణ్యకార్యే చత్వార స్సమభాగినః'

అన్నట్లు, పుణ్యకార్యములందు నేను కర్తననుటయే పాడిగాదు. ఒకవేళ అనవలసి వచ్చినపుడు ఇందులకు నేనొక్కఁడనే కర్తననుటయు సమంజసము కాదు. కావున, ఈ విషయము నింత విపులముగ వ్రాసితిని. పాఠకులు నన్నీ విషయమున మన్నింతురు గాక!

## —: ధన్యవాదము :—

శ్రీవారికి భిక్షలు మున్నగు సత్కారములను జరిపిన ధన్యాత్ముల నామములును, ఆ యా తేదులును స్థలాంతరమున ప్రకటింపఁబడినవి. నా కీ గ్రంథముద్రణ కార్యమున కేలూఁత యొసంగిన శ్రీమంతులు, చిరంజీవులు, టి. బి. గోపీనాథ ఠాకరు, యమ్. రామరత్నదాసును, మిక్కిలి ప్రశంసనీయులు. నా యుద్దేశమును వినినంతనే సంతసించి నన్నీకార్యమునకు ప్రోత్సాహపఱచిన శ్రీ. టి. బాలకృష్ణ మెహతా గారికిని

ఇకార్యమునకు తోడ్పడఁదలఁచి మాబాలురయొద్ద చందా లను జెల్లించిన మహనీయులకును, ఈ గ్రంథముద్రణమునకు అభయప్రదాన మొనరించి కార్యమును సంపూర్ణముగావించి తమ యౌదార్యమును ప్రకటించిన శ్రీయుతులు, టి. బి. మెహతా అండు సన్సువారికిని, ఇంకను నన్నీ సత్కార్యము నకు ప్రేరేచిన నామిత్రులకును, హృదయపూర్వకవందన సహస్రముల నర్పించుచున్నాను.

భక్తరక్షణ దాక్షిణ్య స్వభావుఁడగు శ్రీపరమేశ్వ రుఁడు వీరికి ఆయురారోగ్యైశ్వర్యయశముల ననుగ్రహించు గావుత! మని యామహామహు ననవరతముం బ్రార్థింతును. గ్రంథ మాబాల గోపాలముగ ఎల్లరకు సుగమముగ నుండఁ గలందులకై యుద్దేశింపఁబడి ప్రకటింపఁబడినది, కావున ఇందు వ్యాకరణ నియమముల నెక్కుడుగ చొప్పించిన వాఁడను గాను.

'గుణదోషౌ బుధోగృహ్ణ న్నిందుక్ష్వేళా వివేశ్వరః
శిరసా ధారయతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి' అనినట్లు

ఈ గ్రంథము నాంధ్రలోకము ఆదరించి యిందలి నా దోషములను సైరించి, ఆచార్యసూక్తిముక్తావళిని ధరి యించి ధన్యతం గాంచుఁ గాక! యని యాశించెదను.

విపశ్చిజ్జన విధేయుఁడు.
తూ॥ా. విశ్వనాథ శాస్త్రి
ప్రథానాంధ్రోపాధ్యాయుఁడు,
పచ్చయప్ప పాఠశాల, చెన్నపురి.

5-3-1933



శ్రీ శ్రీ శ్రీ. జగద్గురు, శ్రీ కామకోటి పీఠాధిప.
శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ
స్వాములవారు.

శ్రీరస్తు

శ్రీ గణేశ శారదా గురుభ్యోనమః.

# శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతు లగు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారి ఉపన్యాస సార సంగ్రహము.



## —: శ్రీ గణేశ స్తుతి. :—



అగణిత మహిమా భ్యుదయం
అఖిలశరణ్యం వరేణ్య మగ్రణ్యం,
భవభయహరణ ధురీణం
భజేఽహ మాద్యం గణేశ మఖిలేడ్యం.



## —: శ్రీ సరస్వతీ స్తుతి. :—



శరదిందు వికాస మందహాసాం,
స్ఫురదిందీవర లోచనాభి రామాం,
అరవింద సమాన సుందరాస్యాం,
అరవిందాసన సుందరీ ముపాసే,



## —: శ్రీమదాది శంకరాచార్య స్తవము. :—

కాషాయాంబర ధారిణం గురువరం
వీరాసనాధ్యాసినం,
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరే,
హస్తాంబుజే పుస్తకం,
శిష్యాన్ పార్శ్వగతాన్ సుపుస్తకధరాన్
తేజోధికా న్నిర్మలాన్,
పశ్యంతం కరుణాకరం గుణనిధిం
శ్రీ శంకరార్యం భజే.

## —: విభూతి నామములు :—

“ హిందూ మతమునకును అన్యమతములకును, గల భేదములందు తిలకధారణము ఒక గొప్ప గుఱుతుగ మనము భావింపవచ్చును. తిలకధారణము చేయని హైందవుఁడు కొన్ని సమయములందు క్రైస్తవుఁడు గను, మహమ్మదీయుఁడు గను భావింపఁబడుటకు చాల అవకాశము కలదు. ఈ తిలకధారణము మనకు సత్స్వభావమును, సన్మార్గ ప్రవర్తనమును, గల్గించుటయందు తోడ్పడుచున్నది. ఎంతటివాఁ డయినను తిలకధారణము లేక యెట్టి కార్యమునుగాని మన హిందువు చేయఁజాలఁడు. కారణాంతరమున తిలకధారణమును మన వారిలో కొందఱు నింద్యముగ తలంచినను, హావ్యకవ్యము

లందు మనవారు వారివారి మతాచారము ననుసరించి తిలకధారణము చేయువారు కలరు. ఈ సంప్రదాయమే దాని ప్రాశస్త్యమును వేయి నోళులతో చాటుచున్నది. అరవమున నామమునకు 'తిరుమణ్' అని పేరు. విభూతికి (భస్మమునకు) 'తిరునీర్' అని పేరు. రెంటియందును తిరు శబ్దము శ్రేష్ఠ వాచకముగ నున్నది. ? 'మణ్' అనఁగా మన్ను 'నీర్' అనఁగా బూడిద. మన్ను ఆదిమమైనది. పరమేశ్వరుని సృష్టియందు ప్రథమ పదార్థము. కావుననే పంచభూతములందు పృథ్వి ప్రప్రథమమున చేర్కొనఁబడ్డది. ఆది వరాహమూర్తి పుడమిని జలమునుండి ఉద్ధరించినట్లు మన పురాణములందు కలదు. 'ఉద్ధృతాసి వరాహేణ' అనియు ప్రమాణము కలదు. మన్ను ఇందుచేతనే మిక్కిలి పవిత్రమైన పదార్థమైనది. భౌతికశాస్త్రవేత్త లనిపించుకొనువారు ప్రస్తుతము బుద్ధి వైశద్యముచే ఉన్న వస్తువులైదింటిని తీసికొని, నానావిధముల లోకోపకారముగ 'వైరులెస్సు టెలిగ్రాఫ్' మున్నగు విషయముల కనిపెట్టఁగలిగిరి. కాని, పిడికెఁడు మంటిని జేసియియ్యఁగల భౌతిక శాస్త్రవేత్తను మీరు చూపలేరు. సమస్తమును, ఈభూమి భరియించుచున్నది. భూమి లేనిచో మన ముండుట కవకాశమే లేదు. అంతేకాక మన కాహారమును దొరకదు. భూమివలననే సకల ప్రాణికోటియు అన్నవంత మగుచున్నది. విష్ణుమూర్తి జగత్పరిపాలకుఁడు. కనుక భూమి నుద్ధరించెను. ఈ భూమినే మనము భూదేవి యనియు చెప్పుదుము. యోజించి

చూడఁగా భూమి కన్నను మహాపదార్థము లోకమున లేదు. దానినే విష్ణుప్రసాదముగా భావించి విష్ణుభక్తులందఱు విష్ణు పాదాకృతితో ముఖమున ధరియించుచున్నారు.

భూమిని గోరూపమున ధ్యానించుట మన యాచారము. చతుష్పాద జంతువు లన్నిటియందును గోవు మిక్కిలి పవిత్రమైనది. తన దూడకయి మిగులునట్లుగ పరమేశ్వరుఁడు దాని పొదుగులో క్షీరములను సృజియించి యున్నాఁడు. గోవు తల్లివలె తన క్షీరములచే సకలప్రాణులను పోషింపఁ గలుగు చున్నది. కావుననే, గోవు మనకు తల్లివలె పూజనీయమైనది. చతుష్పాత్తులయందు మఱొకదాని కిట్టి గౌరవము లేదు. కావుననే 'గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్య' మ్మని మన పెద్దలు చెప్పినది. ఉత్తర దేశమున గోపూజలు విశేషముగ జరుగుచుండును. అదేవిధమున భూమియు మన యాహార పదార్థములన్నియు సృజియించి యిచ్చి మనలను బోషించు చున్నది. కావుననే ఆ మంటిని విష్ణుభక్తులందఱు 'తిరుమణి' అను పేరుతో ముఖమున ధరించెదరు. ఇట్టి పవిత్రమైన ఆశయముతో మన పూర్వీకులు ఈపద్ధతిని మనకు చూపి యున్నారు.

ఇఁక భస్మమును గుఱించి యించుక చెప్పవలసి యున్నది. భస్మము శివస్వరూపము నందియున్నది. ఒక వస్తువు ఎట్టి రంగుగలదియైనను తుదకు అగ్నియందు బడినపుడు నల్లనై కట్టకడపట మిక్కిలి తప్తముకాఁగా తెల్లనగుచున్నది. అగ్ని ప్రవేశించిన మార్గమంతయు నల్ల నగును. కావుననే

యాతనికి 'కృష్ణవర్త్మ' యనెడి నామ మన్వర్థమైనది. "మన మెన్ని వేషముల ధరియించి యీ లోకమున సంచరించినను తుదకు బూడిద కావలసినవారలమే" యను ధర్మమును, నీతిని, మనకు భస్మము బోధించుచున్నది. శివుఁడు త్రిమూర్తులందు లయకార్యమును చేయుచున్నాఁడు. విభూతి శివస్వరూపము గలది. భస్మము లోకముయొక్క అనిత్యతను మనకు చాటుచున్నది. ఎట్టి దోషగుణము గల వస్తువైనను అగ్నియందు బడి పవిత్రత నందుచున్నది. గోమయమునందు మిక్కిలి పవిత్రమగు గుణముకలదు. కావుననే, మనము గోమయమును, గృహ, భూ, భాండ, ఆత్మ, ద్రవ్య, స్థల, శరీర శుద్ధికర్మములయం దుపయోగించుచున్నాము. అట్లే భస్మమునకును గోమయమే శ్రేష్ఠమైనదని పేర్కొనఁబడినది. భస్మమును శరీరమందంతటను బూసికొనవచ్చును. "నామము పెట్టుకొనుట, విభూతి పూసికొనుట", అను వాక్యజాతీయతయే భస్మమును ఒడలంతయు పూసికొనవచ్చునని చెప్పకయే చెప్పుచున్నది. ఇంతేకాక, భస్మలేపనముచేత రానురాను వాసన ద్రవ్యములందలి యాసవదలి వైరాగ్య సంపన్నుఁ డగుటకును మానవుఁడు సమర్థుఁ డగుచున్నాఁడు "నే నందముగనున్నాను, నేను చక్కనివాఁడను" అను గర్వము దినక్రమేణ భస్మలేపనముచేతనే దూరముగా తొలఁగిపోవును. అహంకారము తొలఁగి పోవునంతకు మానవుఁడు ముక్తిని సమీపించుచుండును. ఇంకను భస్మలేపనమున మానవునకుఁ గలుగు శుభము లెన్నియో కలవు. కావున, మీర లెల్లరు హిందూ

మతమునకు ముఖ్యచిహ్నమగు తిలకమును ధరించి మన వృద్ధాచారమును ధర్మమును కోలుపోవకుందురు గాక ! యని యాశించుచున్నాను.

---

## —: జగద్గురు డెవ్వఁడు ? :—

రెండవనాఁటి యుపన్యాసమున శ్రీవారు శ్రీ మచ్ఛంకరభగవత్పాదాచార్యులవారి అవతార కారణమును, అద్వైతమత స్థాపనావశ్యకతను, వివరించుచు సందర్భవశమున నింకను గొన్ని విషయములను అనుగ్రహించిరి. దానిసారమే యిది.

"ఏ మహనీయుని పేరు విని మీర లందఱును ఇచ్చోట గుమిగూడి వేచియుంటిరో, ఏ కరుణార్ద్రహృదయుని స్మరియించినంతన దురితములన్నియు నగ్నికణమును సోఁకిన తూలరాశివలె నగుచున్నవో, ఏ శిష్యవత్సలుని పేరు మున్నిడుకొని మేమూరూర సంచరించుచు దదాజ్ఞను యథామతిని అనుష్ఠింపఁగలిగితిమో, అట్టి శ్రీ శంకర భగవత్పాదుల చరిత్రమును మనము తెలిసికొనుట మన ముఖ్యధర్మములందొక్కటి యగునని తలంపవచ్చును. జగద్గురుఁ డనఁగా, గీతామృతమును కడవలయందు నించియుంచిన శ్రీ కృష్ణభగవానుఁడే. తలలు తెగఁగొట్టుకొను కాలమున అజ్ఞానవిమోహితుఁడగు నర్జునుని ప్రజ్ఞాన కలితునిఁగఁ జేసిన మహాత్ముఁడు జగద్గురుఁడుగాక మఱెవ్వఁడు కాఁగలఁడు ? గీతాచార్యుఁడగు నామహానుభావునకే యీనామము సార్థకమై యున్నది.

ఇఁక ప్రస్తుతమును విచారింతము. మన ఆచార్యుల వారు జననాది పండ్రెండవ వత్సరముననే యిల్లువిడిచి బయలు దేరిరి. వారు జీవించినది ముప్పదిరెండు వత్సరములే యైనను శ్రీవా రొనరించినవి మాత్రము అమానుష కార్యము లని మనము ఏమాత్రము సంశయింపక దృఢముగ నమ్మ వచ్చును. శ్రీవారు గంగోత్రి మొదలు కన్యాకుమారి వఱకుఁ గల మన భారతభూమి నంతయు సంచరించిరి. ఇప్పటికి రెండువేల సంవత్సరములనాఁడు శ్రీవారు అవతరించియుండిరి. అపుడు ద్వాపరము వెళ్లి కలియుగము యొక్క ప్రారంభ ముగ నుండినది. అప్పటికి సుమారు డెబ్బదిరెండు మతములు మన ఖండమున నుండినటుల గ్రంథములందుఁ జెప్పఁబడి యున్నవి. ఇవి ప్రస్తుతము బాలురు చదువు దేశచరిత్ర గ్రంథములందు లేవు. కృతమున సత్యము మెండుగ నుండె ననియు, త్రేతాయుగమున నసత్యము కొద్దిగ తలచూపెననియు, ద్వాపరమున సత్యాసత్యములు మిశ్రమై యుండెననియు మన గ్రంథములు నుడువుచున్నవి. మన ఋషులు రాఁబోవు కలి యుగము పాపభూయిష్ఠమైనదనియు, కలిజనులు పాపముల నాచరించుటయందు ప్రీతికలిగి యుందురనియు, వారి నుద్ధరించుట తమ కర్తవ్యమనియు, నెంచి మన నిమిత్తము శ్రుతి స్మృతి పురాణేతిహాసముల రహస్యములను మనకు అవగత మగునటుల గ్రంథములను రచియించి మన కొసంగిరి. కృత త్రేతాదియుగముల గుఱించియు, అప్పటి సత్యాసత్యముల గుఱించియు మన మే మెఱుంగుదు మని యిక్కాలమందలి

విద్యాధికులు కొందఱు నుడువుచుందురు. అయినను ఇందుల కొక చిన్న ఉదాహరణము కలదు. చీఁకటిలో నున్నవారు వెలుఁగునుగూర్చి వినియుండుటచేతనే దానికై ప్రతీక్షించు టయు సంభవ మగుచున్నది. అట్లుకాక, సదా చీఁకటిగానే యుండియుండిన వెలుతురును గుఱించి తలపెట్టువాఁడే లేక యుండును గదా! కావున, మనము వెలుతురొకటి కలదను నంశమును సామాన్యమగు తెలివితేటలచేతనే యంగీకరింప వచ్చును. మన ఆచార్యులవారి కాలమున నున్నయన్ని మతము లిపుడు లేవు. ఇపుడు ఏ డెనిమిది మాత్రమే కలవు. వాని యందును వైదిక సంప్రదాయ సిద్ధములైనవి ద్వైతవిశిష్టా ద్వైతాద్వైతవల్లభాదిమతములే. ఇవి గాక ఆర్య, బ్రహ్మ సమాజాది మతములు కొన్ని గలవు. అద్వైతమతమునుం డియే యన్నియు కలిగినవి. మన అద్వైతమతమున విభూతి పెట్టుకొనువారును, నామము ధరించువారును కుంకుమము పూసికొనువారును, అంగారమును ధరించువారును, కలరు. ఊర్ధ్వపుండ్రమును ధరించి భాగవత సంప్రదాయమును అవ లంబించిన శ్రీ త్యాగరాజ స్వామ్యాదులును మనవారే. ఏ మతము నందైనను సరియే ఉన్న సుగుణములను గ్రహించి దుర్గుణములను పాఱఁద్రోలునదియే అద్వైతమతముయొక్క పరమార్థము. 'రండు మీరలు మా మతములో చేరుఁడు.' అని అద్వైతమతము అన్యులను బలవంతపఱుపదు. మీఁదు మిక్కిలి మనుష్యుఁడు తొలుదొలుత నన్నిటిని సమముగ భావించువాఁడుగనే యున్నాఁడు. కావుననే, యీ మతము

లోకమున మనుజునకు స్వతసిద్ధముగ పట్టుపడఁగలదు. ఈ మతవ్యాప్తికై అన్యమతస్థులవలె కృషిచేయ నవసరము కలుగదు. ఏలయనఁగా నన్నిటికి మన మతమే మూలకారణము. ఒకవేళ అన్యమతము నవలంబించినవాఁడును తుట్టతుదకు అద్వైతమతమునందియే పరమార్థము నందుచున్నాఁడు. ఇందులకు తత్కాలానుగుణముగ నొక్క చిన్న ఉదాహరణము చెప్పవచ్చును. ఏమనఁగా? ఒక్కడు రైలు దిగునప్పుడు జట్కా బండ్లవారు పలువు రరుదెంచి 'మా బండిలో నెక్కుఁడు, రండు పోవుదము.' అని మాఁటలు లాగికొందురు, ప్రతివాఁడును వానిబండిని, గుఱ్ఱమును, ఆత్మశక్తిని, శ్లాఘించికొనును. కాని, రైలు దిగినవాఁడు మాత్ర మెందఱితో మాట్లాడినను తుదకు తొలుత మాట్లాడిన బండివానితోడనే కలిసికొని వెళ్లును గదా! అట్లే మధ్యలో నెన్ని త్రోవలను ద్రొక్కినను చివరకు మానవుఁడు అద్వైతమునే యవలంబించి కృతార్థుఁడగు చున్నాఁడు.

ఒక్కొక్క యుగమునందును లోకోపకారార్థ మొక్కొక్క మహనీయుఁ డవతరించుచుండును. గౌరాంగుఁడు మున్నగువా రట్లవతరించినవారే. తటాకము త్రవ్వించుట, గ్రంథముల వ్రాయుట, సత్రములు గట్టించుట, నూతుల ద్రవ్వించుట మున్నగున వన్నియు లోకోపకారములనియే చెప్పఁబడుచున్నవి. అట్లే మతము నుద్ధరించుటయు లోకోపకారమనఁబడుచున్నది. రాజకీయములందు దిగి పనిచేయుటయు, పరపతి సంఘసభ్యులై కృషి చేయుటయు, పురపాలక

సంఘసభ్యులై పౌరుల సేవించుటయు మున్నగునవిగూడ లోకోపకారము లనియే వ్యవహరింపఁ బడుచున్నవి. ఇట్టి లోకోపకారార్థమే మన ఆచార్యులవారు అవతరించి పిచ్చి మతముల నన్నిటిని పాఱఁదోలి షణ్మతములను స్థాపించిరి. తమ యభిమతమును స్థిరముగ నిలుపఁదలఁచి కైలాసము నుండి పంచలింగములందెచ్చి యైదు స్థలములం దాలింగము లను ప్రతిష్ఠించి, పూజాది కైంకర్యములకు నిజశిష్యులను అందందు నెలకొల్పి కైలాసమునకుఁ జనిరి. వారియాజ్ఞను మాదృశులు సంపూర్ణముగ నెఱవేర్పఁ జాలని వారయ్యును, యథామతిని వారి గభీరాశయములను పరమకారుణికతను, మీ యందఱకు తేటతెల్లము సేయవలసినది అస్మదాదుల విధియని తలంచు చుందుము. ఒక గ్రామమున నొక ఆలయ మున్నచో నది యా యూరివారికిని పరిసరవాసులకును మాత్రమే ప్రయోజనకారి కాఁగలదు. కాని మఠములం దుండు దేవాయతనమును పురస్కరించుకొని యతులు దేశాటనము సలుపుచుందురు. ఈ దేశాటనమున నొక్క గ్రామమునందలి వారేకాక, పలువురు భక్తులు పరమేశ్వ రానుగ్రహమును బొందుట కవకాశము కలుగుచున్నది. ఇక్కారణముననే యతులును, ఉంచినచోట కాలినుంచక తిరుగుచుందురు. యతులు జగత్కుటుంబులు. తమంతకు తాము కృతార్థులై వారూరకుండ లేరు. లోకము ననుగ్ర హించు చుండుటయే వారిముఖ్యాశయము. క్షణక్షణమును వారు విశ్వారాధనము చేయుచున్నారు. మన యాచార్యుల

వారి దివ్య సంకీర్తనము మన కెల్లరకు సౌఖ్యప్రదము. పరమ శ్రద్ధాళులరై మీరలెల్లరు చాలవ్యయ ప్రయాసములకులోనై యింతదనుక నిట కాచియుండినందున మీ మూలమున నేనును సత్ప్రసంగమున కాలమును వ్యయము చేయగల్గితిని.



## —: పుణ్య పాపములు :—

మూఁడవనాఁటి యుపన్యాసమున శ్రీవారు పుణ్య పాపములను గుఱించి యుపన్యసించిరి.

"లోకమున పుణ్యము, పాపము, అని రెండు విషయములు కలవు. ఆత్మహితమును, లోకహితమును, అయినది పుణ్యము. తద్విపరీతమైనది పాపము. ఇతర యుగములందు కంటె కలియందు పాప మధికముగనున్నది. ప్రతిమనుష్యుఁడును ఈయుగమున పుణ్యమునే చేయఁదలచును గాని, మానవుఁడట్లు చేయుటలేదు. సదాలోకమును వచించుటకే ప్రయత్నించుచున్నాఁడు. మానవుని మనస్సు క్రోఁతివంటిది. మానవుఁడు తెలిసినవాఁ డయ్యును మనమునకు లోనై పాపకార్యములందు పరిభ్రమించుచుండును. మన ఆచార్యులవా రనేక గ్రంథముల లోకోపకారార్థము రచియించి యుండిరి. వాని యందు ప్రశ్నోత్తరరత్నమాల యను గ్రంథ మొక్కటి కలదు. అందులో నొక్క ప్రశ్న కలదు. ఏదియనఁగా ? 'కింశల్యమ్ ?' అని. దీనికి ఉత్తరమేమనఁగా రహస్యకృతపాపమని కలదు. మొదట మనము శల్య మనుపదమున కర్థము తెలిసికొనవలసి యున్నది. శల్యమనఁగా ? బాణము. ఇది అంకు

శము చివరవలె నుండును. ఇది శరీరమున ప్రవేశించినచో కండలను దీసికొనియే వెలుపలికి రావలసి యుండును. అట్లే మనము రహస్యముగాఁజేయు పాపమే మన మనమున నాటి సదా మనలను పీడించుచుండును. ఆ శల్యము మనస్సున గ్రుచ్చికొనకుండునటుల మనము ప్రవర్తించుచుండుటకే పుణ్య మని పేరు. బాల్యమున నుండియే మన దేశమునందును, మన జాతియందును, తల్లి దండ్రులును, ఆచార్యుఁడును, పుణ్య కార్యములను మనకు ప్రదర్శించుచున్నారు. 'ఓం, నమశ్శి వాయ, ఓం నమోనారాయణాయ' అనియే మనము అక్ష రాభ్యాసకాలమున గ్రహించుచున్నాము. మన ఖండము నందు కవికులగురుండని ప్రసిద్ధికెక్కిన కాళిదాసుఁడును ప్రథమమున బాల హితార్థియై వాగర్థప్రతిపత్తి కొఱకు రఘువంశ మను కావ్యమును రచియించెను. కావున, పెద్ద లెల్లరు బాలుర హితమునే చేయుచుండుట ముఖ్యవిషయము. మనకు పుణ్యపాపముల తారతమ్యము తెలియక కొన్ని వేళ లందు సంశయము కలుగుచుండును. వానిని మనము ప్రమాణ వచనములచేత నిర్ణయించికొని భారమంతయు శాస్త్రములం దును, వేదములందును ఉంచి, మనము పనులను చేయు చుండవలెను. అట్లయిన శల్యము మన హృదయమున ప్రవే శింపక మఱలిపోవును. వేద శాస్త్రములందలి ప్రమాణబుద్ధి లేనినాఁడు మనము పాపమును చేయువారమే యగుదుము. మీకెల్లరకును ఈమాటలు అంగీకార్యములుగఁ దోఁచినపుడు ఈవిషయములను ఆచరింపఁ గోరెదను.

---

## —: చిన్ముద్ర యన నేమి ? :—

నాలవనాఁటి యుపన్యాసమున ఆచార్యులవా రిట్లు సెలవిచ్చిరి.

'మనము దేవాలయమునకు వెళ్లినపుడు శివాలయమగుచో నచట గర్భగృహమునకు దక్షిణభాగమున దక్షిణాభిముఖుఁడై మఱ్ఱిచెట్టుక్రింద నలుగురు శిష్యులతో శ్రీ దక్షిణామూర్తి యను పేర నొక్క ప్రతిమను చూడఁగలము. ఆ దక్షిణామూర్తి అంగుష్ఠమును, తర్జనియును చేర్చిపట్టుకొని తమ పార్శ్వగతులగు శిష్యులకు చూపుచుండును. దీనికి చిన్ముద్ర యని పేరు. ముద్రయనఁగా గుఱుతు. చిత్తు అనఁగా జ్ఞానము. నాట్య శాస్త్రములందు అభినయముచే మనోభిప్రాయములను దెల్పుట ప్రసిద్ధము. అట్లే శ్రీ దక్షిణామూర్తి స్వామియు తమ చిన్ముద్రచే శిష్యుల హృత్తాపమును బోఁగొట్టు చున్నారని ఇందలి యభిప్రాయము. ఇంతేకాక, ఈశ్వరుని గుఱించి మన మెట్టి సమయమందయినను చెప్పవలసి నపుడు తర్జనితో ఆకసమువంక చూపువాడుక కలదు. తన్నుతాను చూపునపుడు అంగుష్ఠముతో చూపుట ఆచారమగును. ఇచట అంగుష్ఠముతో చూపుట జీవాత్మయనియు, తర్జనితో చూపుట బ్రహ్మమనియు, ఈ రెంటియొక్క కలయిక ఆ బ్రహ్మమే జీవాత్మయై యిక్కడ వసియించుచున్నాఁడనియు మనమీ ముద్రచేత తెలిసికొనవలయును. ఈ సందర్భమున నే నొక్క రిట్లు చెప్పిరి. " చిత్రంవట తరోర్మూలే వృద్ధా

-శ్శిష్యా గురుర్యువా, గురోస్తుమౌనం వ్యాఖ్యానంశిష్యాస్తు
-చ్ఛిన్నసంశయాః" అని నుడివిరి.

మన ఆచార్యుల వారును, సురేశ్వర, పద్మపాద, హస్తామలక, తోటకాచార్యులను శిష్యచతుష్టయ మధ్యమున ఆసీనులై యున్నట్లు చిత్రకారులు వ్రాయుచుందురు. అట్టి చిత్రముల నిపుడు మీరలు రవివర్మ చిత్రించిన పటములందు నయితము చూచుచున్నారు.

—: ఆచార్య పరంపర :—

'నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్ర పరాశరంచ, వ్యాసం శుకం గౌడపాదం మహాంతం గోవింద యోగీంద్ర మథాస్య శిష్యం, శ్రీ శంకరాచార్య మథాస్య పద్మ, పాదంచ హస్తా మలకంచ శిష్యం, తంత్రోటకం వార్తిక కారమన్యా నస్మద్గురూన్ సంతత మానతోస్మి' అని మనకు ఆచార్యపరంపరా స్తోత్రము కలదు. ఈ శ్లోకమున శ్రీమన్నారాయణాది శుకపర్యంతము పుత్త్ర పరంపరగను, తర్వాత గౌడపాదులు మొదలుగ నప్పటివఱకు శిష్య పరంపరగను నీ పీఠము నధిష్ఠించినటుల మనము తెలిసికొనుచున్నాము. వేదము 'మాతృదేవోభవ, పితృదేవోభవ ఆచార్యదేవోభవ' అని నుడువుచున్నది. కావున, మనకు తల్లిదండ్రులకు తర్వాత ఆచార్యుఁడే పూజనీయుఁడై యున్నాఁడు. వింధ్యకు ఆవలనుండు దేశములలోని వారికి గౌడులని పేరు. లేదా, నర్మదానదికి ఉత్తరదిక్కున నుండు వారనియు

చెప్పవచ్చును. నర్మదకు దక్షిణమున నుండు వారికి ద్రావిడు లని పేరు. అనఁగా ఘూర్జర ద్రావిడ కర్ణాట కేరళాంధ్రులు. ఒరిస్సాకు ఉత్కళ మని పేరు. వీనికి చేరినవే మిథిల, జనక పూర్, దర్భాంగ మున్నగునవి. ఇవన్నియు జనకచక్రవర్తి గారి రాష్ట్రమునకు లోఁబడినవి. రాముఁడు ధనుర్భంగము చేసినచోటికే దర్భాంగ యని చెప్పుచున్నారు. ఇది యిటుండనిచ్చి ప్రస్తుతమునకు వత్తము. మన ఆచార్యుల వారు పంచగౌడులకు చేరినవారు. కాన, వారికి గౌడపాదు లను పేరు వచ్చినది. గౌడపాదులవారి శిష్యులు గోవింద యోగీంద్రులు. వారి శిష్యులే మన శంకర భగవత్పాదులు. కావుననే మన ఆచార్యులవారు భజగోవింద శ్లోకముల రచించుకాలమున తమ గురుపరముగను, శ్రీమన్నారాయణ పరముగను, అర్థమగునటుల 'గోవిందంభజ మూఢమతే' అని చెప్పి మకుటమును కుదిర్చిరి. మనమెల్లరము సకల కార్యా రంభమునందు మన ఆచార్యుల పరంపరను ధ్యానింప వలయును. అట్లగుచో మనకు సకల కార్యములందును జయము కలుగును.

---

## —: ద్వైతము :—

ఇంతకుమున్ను శ్రీదక్షిణామూర్తి స్వామివారు ధరి యించిన చిన్ముద్రనుగూర్చి యించుక ముచ్చటించి యుంటిమి. జీవబ్రహ్మైక్య రహస్యమే చిన్ముద్రాస్వరూపమని నిన్నటిదిన మున మనము తెలిసికొనియున్నాము. వెండియు, మాధ్వమత

స్థాపకులగు శ్రీమధ్వాచార్యులవారు రెండు వ్రేళ్లచే నొక్క ముద్రను జూపునటుల మనము చిత్రపటములందుఁ జూచు చున్నాము. వానియర్థము రెండుకలవని చెప్పుట. పోనిండు. జ్ఞానముద్రవలె నారెండు వ్రేళ్లు కలిసికొని ఎన్నటికైన అద్వితీయము కాఁగలదా? యని మనము యోజింతుమేని అది యెన్నటికిని అసంభవమేయగును. తర్జని అంగుష్ఠముతో కలిసినంత సుకరముగ నది కలియఁగలదా? యని తలంతుమేని అట్లును తలంపవీలులేదు. ఏలయనఁగా? రెండుచేతులలోని రెండురెండు వ్రేళ్లును వేర్వేఱుగ నుండవలసిన వేకాని, యొక్కటిగా కలియఁగలిగినంత అవకాశము లేదు. కనుక ఆమతమున నెప్పుడును రెండనుభేదము తుదముట్ట నశియింపదనియే మనము తెలిసికొనవలయును. ఇదియునుగాక, మనమొక్క చిన్నియుక్తినుండి యీ విషయమును గ్రహింపఁగలము. ఒక్కటి యను సంఖ్య లేనపుడు రెండు అను సంఖ్య పుట్టుట కవకాశములేదు. అట్లే మనము ఒక అద్దమునందే అనేకములను జూచుచున్నాము. వెండియు, ననేకములగు భేదములు ఒక్క యద్దమున నిమిడియున్నవి. ఇంతేకాక, యిప్పుడు ఎఱుపురంగును గూర్చి యొకఁడు చెప్పినపుడు దానికి ముందు తెలుపు, పసుపు, మున్నగు రంగులు కొన్ని యుండవలసియున్నవి. లేదేని దీనికి ఎరుపు అని పేరువచ్చుట కవకాశము లేదు. ఇత్యాది నిదర్శనములనుబట్టి మన యద్వైతము సనాతనమైనదని మనము దృఢముగ నమ్మవచ్చును. ఈశ్వరుఁడు నేనే యనుట అహంభావముకదా? యని కొందఱు ఆక్షేపిం

చుటయును మనము ఒకప్పుడు వినుచుందుము. నిజమే. వారి యుక్తియును ఒప్పుకొనఁదగినదే కాని, దానికి సమాధాన మే మనఁగా? ఒక్క త్రాఁటినిఁజూచి మనము సర్పమని భ్రమి యించువఱకు మన మనస్సున భయము, అభిమానము దుఃఖము, అన్నియు కలుగుచున్నవి. ఆత్రాఁటియందు సర్ప భ్రాంతి లేనపుడు దానిని మనము లక్ష్యముసేయము. 'అహం' అని తలఁచునంతవఱకు మనకు దుఃఖము, భయము, మున్నగు కష్టములు కలుగుచునే యుండును. సర్వము ఈశ్వరమయ మనియు, ఆ ఈశ్వరునియందే నేనును వసియించుచున్నా ననియు, తలంపు కలుగునపుడు అహంభావము లేదు. నఖశిఖ పర్యంతముగల యీదేహమునే మనము 'నేను, నేను' అని చెప్పుచున్నాము. ఈ కాలిగోటిని తీసి ఆవల వేసినపుడును, ఈ తల యందలి వెంట్రుకను దీసి ఆవల వేసినపుడును, వానిని 'ఇది నాగోరు, ఇది నావెంట్రుక' అని చెప్పుటకు మన మనస్సు సమ్మతింపదు. ఈ శరీరమునుండి వీడిపడిన మాంసఖండమును గూడ 'ఇది నామాంసము' అని చెప్పుకొనుటకు మనము ఇష్ట పడము. ఆమాంసము మనకు అసహ్యముగనే తోఁచును. అట్లే మనము 'అహం' అను విషయమును సయితము ఈశ్వరునియం దే వదలిపెట్టుచున్నాము. అంతటితో 'అహం' అను శబ్దము నశియించిపోవుచున్నది. ఇఁక 'అహం' అను శబ్దమే నశియించి నపుడు భావము అనునది కలుగుట కెక్కడ అవకాశము కలదు? దీనికే అద్వైతమని పేరు. ఈశ్వరుఁడు ఒక్కఁడే. అత డనేక రూపములం దొక్కఁడై యున్నాఁడు. అతఁడు తప్ప

ప్రపంచమున రెండవ పదార్థము లేదు. కావున బుద్ధిని మనము ఈశ్వరునియందు పొసఁగునట్లు చేసికొనవలయును. 'నేను, తాను' అను సంతవలకు మనము కడతేఱఁజాలము. ఒక్కటే అనునపుడే మనము కృతార్థులమగుదుము. మనస్సు అనునది కోఁతివంటిది. కోఁతికి పట్టుదల అధికము. దానిచేత నొక్క వస్తువు దొరకినపుడు అది దానిని గట్టిగ పట్టుకొనును. నీవు ఆ వస్తువును విడువుమన్నను విడువదు. దానికి నీవు మఱొక వస్తువు నందియిచ్చినపుడే అది మున్ను చేతనుంచికొన్న వస్తువును వదలును. అట్లే మనము మనస్సనెడి కోఁతికి పరమాత్మధ్యానమును చవిజూపి నట్లయిన, అది విషయవాంఛల యందు రోసి ఆ పరమాత్మ ధ్యానమునే గట్టిగపట్టుకొనును. దానికి ఈవిషయము పట్టుబడువఱకే మానవుఁడు మిక్కిలి కష్టపడవలసి యుండును. ఆవల నది వదలిపెట్టు మనినను వదలునది కాదు.

---

—: మానవుఁ డెట్లు ముక్తుఁడగును? :—

మానవుఁడు తన సకలస్వమును భగవదర్పణము చేయవలయును. అప్పటికే కాని, ముక్తుఁ డనిపించికొనఁడు. మన పూర్వికులు తమ సకలస్వమును భగవదర్పణము చేసిరి. ఇందుచేతనే వారి భగవద్భక్తి తేటతెల్ల మగుచున్నది. మన దేశమునందు జాతులును, మతములును వేర్వేఱైనను మన యెల్లర మనస్సుమాత్రము ఒక్కటిగనే యున్నది. ఇతర దేశీ

యులకు జాతి మతములందును ఆహారవ్యవహారములందును భేదములు లేకపోయినను మనస్సులు మాత్రము పరస్పర భేదమును బొందియున్నవి. జర్మనీవారిని జూచిన ఇంగ్లీషు వారు సహింపరు. ఇంగ్లీషువారిని జూచిన అమెరికావారు సహియింప రని మనము నానావిధములుగ వారి మనోభేద ముల నెఱుంగుచున్నాము. మన హైందవులందు జాతి మత భేదమున్నను, ఆహారవ్యవహారములందు తెరలు గట్టు కొన్నను, మనస్సుమాత్రము ఒక్కతీఱుననే యున్నది. బ్రహ్మ క్షత్రియాదుల యాచారములను మనవారు గర్హింపరు. అవి వారివారి సంప్రదాయము లనుబుద్ధితో అందఱు శాంతచిత్తు లై యున్నారు. ఈ విషయమునకై ఒకరితోనొకరు కలహిం చుటలేదు. ఈ పద్ధతి నేఁటివఱకు మనదేశమున జరుగుచునే యున్నది. ఈపద్ధతులచే మనవారు పరస్పరము అవమానింపఁ బడినటులను తలఁచుటలేదు. ఇఁక రేపటి విషయమును మన మూహింపలేము. అది ఈశ్వరాయత్తము. ఈ విషయ మిట్లుండ నిండు. ప్రస్తుతమునకు వత్తము. మన దేశమున సకల కళలును, సకల ధనమును, అది యిది యననేల? మనవారు తమ సర్వశక్తులను ఈశ్వరునియం దర్పించుట యాచారమై యున్నది. ఉదాహరణముగ శిల్పమును గ్రహించితిమేని, మన శిల్పులు తమ నైపుణ్యమును దేవాలయనిర్మాణకార్యము లందు జూపియున్నారు. కావుననే, విదేశీయులు భారతీయ నాగరకతను తెలియఁగోరి మహాబలిపురము మున్నగుచోటుల లోని చిత్రములను ఫోటోలు తీసికొని పోవుచున్నారు. ఈ

విషయ మిటుండనిచ్చి మనము దీనిచే ముఖ్యముగఁ దెలియఁ దగిన దేమనఁగా? మన దేశములో నెవ్వఁ డెందులో సమర్థుఁడై యుండినను వాఁడా సమర్థతను భగవద్విషయముననే సమర్పించుచుండె ననుట. కావున, మానవుఁడు తన మనస్సును మాత్రమే కాక యితరద్రవ్యములను సయితము యథాశక్తిగ భగవదర్పణము చేయవలయును. మానవుఁడు తన సంపాదనమందు ఆఱవవంతు భగవత్కైంకర్యమునందును పరోపకారాది ధర్మములందును వెచ్చింపవలయును. ఈ పద్ధతి మీఁదనే మన పూర్వికులు పూర్వకాలమున నిన్ని దేవాలయములను/ సత్రములను, తటాకములను, ఇతరసంస్థలను,/ కల్పింపఁ గలిగిరి. ఇపుడు మన మట్టి ధర్మములను చేయనేచేయ లేము గదా? తుదకు మరమ్మత్తులు చేసికొని, ఉన్నవానిని కాపాడుకొను యోగ్యతయును మనకు లేనందులకు చింతిల్లవలసి యున్నది. ప్రస్తుతము ఎంతవచ్చినను తినుటకే చాలదని పలువురు మొఱలిడుచుందురు. దేశవిభాగము లేక అంతయు నొక్కటిగ కలసిపోయినందున మనకు ఇట్టి యిక్కట్టు కలిగినది. ఇపుడు మనము ఆఱవవంతు దానధర్మపరోపకారాదులకు వెచ్చింపలేకపోయినను ప్రతిదిన మొక కాని వంతుననో అర్థణావంతుననో ఉండీలో వేయుచు కొంత మొత్తము చేరిన తర్వాత నొక కూపము త్రవ్వించుటయో, సకల భూతహితముగ నొక్క తటాకమును త్రవ్వించుటయో యంత్రశాలల నిర్మింపించుటయో, మఱెట్టి ధర్మమునైన చేయుటయో మంచిది. ఇదియు ఈశ్వర ప్రీతికరమైన కార్య

మే. 'అర్థాబహిశ్చరాః ప్రాణాః' అని మన శాస్త్రములందు కలదు. కాన, అర్థమును త్యాగము చేయునంతవఱకును మనకు ఈశ్వరుఁడు గొప్పవాఁడుగ దోఁపఁడు. భగవంతుఁడు గొప్పవాఁడుగ దోఁచినపుడు మనకు అర్థము అల్పముగనే తోఁచును. [ఇట్టి స్వార్థరహితమగు త్యాగబుద్ధిచేతనే మన వారు గొప్పగొప్ప దేవాలయాది ధర్మకైంకర్యములను చేయగల్గిరి.] అని, యిదివఱకే చెప్పి యున్నాను గదా? కావున మానవుఁడు స్వార్థపరుఁడగు నంతకు ముక్తుఁడు కానేరఁడు. దీని యర్థమును మనము చక్కఁగ గుర్తెఱింగి సకలమును ఈశ్వరునియందర్పించి మనము నిమిత్తమాత్రులమై కృతార్థత నందవలసి యున్నది. మిమ్ములనందఱను నేఁటి మాటల చేత నింతదనుక కూర్చుండఁబెట్టి శ్రమపెట్టితిని. తమిళమున శరీరమునకు, 'మెయి' అని పేరు. అయితే శరీరము మెయి కాదు, అనఁగా నిశ్చయము కాదనుట. 'పొయ్యే', అనఁగా అబద్ధమే. అయినను మనము ఈ పొయ్యిచేతనే మెయ్యిని సాధింపవలసియున్నది.

---

## —: మనుష్యుఁడు గుణవంతుఁడు కావలయు ననుట. :—

మనము సమస్తమును ఈశ్వరార్పణ బుద్ధితోఁ జేయుచు మానవుఁడు నిమిత్తమాత్రుఁడుగ నుండవలయునని యీవఱకే తెలిసికొని యున్నాము. అహంభావము సర్వథాత్యజించి దేవతాపూజాదికమును ఒనరింపవలయుననియు నిన్నటి

దినమున తెలిసికొంటిమి. అట్లుకానిచో ఇతరు లనుకొనునటుల అన్నిపూజలును వ్యర్థములే యగును. బ్రహ్మార్పణ బుద్ధితోఁ జేయుకార్యములే నిశ్చయమగు భక్తిని రుజువుచేయఁగలవు. సద్గుణములేనిచో భక్తి అలవడదు. గుణమువలననే కార్యము ముగియుచున్నది. ఇప్పట్టున ఉదాహరింపఁదగిన చిన్ని శ్లోక మొండుగలదు. వినుండు. 'యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతాం, అపంథానంతు గచ్ఛంతం సో దరోఽపి విముంచతి' అనఁగా న్యాయ్యమార్గ ప్రవర్తకుఁడగు గుణవంతునకు తిర్యగ్జంతువులు (పశుపక్ష్యాదులు) సయితము సాహాయ్యపడుచున్నవి. అన్యాయ్యమార్గమున నడచువానిని సహోదరుఁడు సయితము వదలిపెట్టు చున్నాఁడని ఆశ్లోకము యొక్క భావము. ఈశ్వరుఁడు తెలివితేటలతో మనుష్యుని ఊర్ధ్వముఖునిఁగా సృజించియున్నాఁడు. అనఁగా పుణ్యపాప ముల తారతమ్యముల గ్రహించి మనష్యుఁ డూర్ధ్వలోకగామి త్వమునుసంపాదింపఁగలవాఁడని దానిభావము. ఈ తెలివితేటలు తిర్యక్కులకు లేవు. అవి నిడివిగా నున్నవి. మఱియు అవి అడ్డ ముగా సంచరించు చున్నవి. వానికి పుణ్యపాపములులేవు. ఒక గోవు ఒకనిని కుమ్మె ననుకొందము. దానిచేత గోవునకెట్టి పాపమునులేదు. ఏలయనఁగా? దానికి అపకారము చేయ వలయునను తలంపులేదు. తారతమ్యజ్ఞానముగల మనుష్యుఁ డట్టి కార్యమును చేయునపుడే తత్ఫలమును పొందుచున్నాఁడు. మనుష్యుఁడు ఎంత గుణవంతుఁడగునో అంత లోకాభిమానము ను చూఱగొనుచున్నాఁడు. అవగుణము కలవాఁడెంత ధనవం



శ్రీమదాంగీరస పుష్యశుద్ధ పౌర్ణమీ బుధవారమున శ్రీవారు
దీక్షా విసర్జనానంతరము శ్రీ ఏకామ్రేశ్వరస్వామి
పుష్కరణియందు స్నానముచేయుట.

డైనను, ఎంతటి విద్వాంసుఁడైనను లోకులందు వానికి పలుకుబడి యుండదు. అట్టివారిని దుర్మార్గులని లోకులు నిందింతురు. అంతటితో నూరకుండరు. తగినదండనమును సయితము చేయుదురు. దుర్మార్గుల నభిమానించుట, పాపము. వారిని శిక్షించుటచే పుణ్యము కలుగును. దీని యభిప్రాయమునే మన పెద్దలు ఈ చిన్నశ్లోకముచేత మనకు తెలిపియున్నారు. 'దేశ భాషలలో వ్రాయరాదా? ఏల యిట్టి యభిప్రాయముల నన్నింటిని సంస్కృతములో వ్రాయుట?' అని కొందఱు తలంపవచ్చును. సంస్కృతము సకలదేశములందును తెలిసిన[illegible]గిన భాష. కావున మనవారు ఆ భాషలోనే ప్రతియంశమును వ్రాసియుంచిరి. పై శ్లోకమునే విస్తరించిచెప్పఁగా ఇరువది నాలుగువేల గ్రంథమగు రామాయణమైనది. మహాగుణవంతుఁడగు శ్రీరామచంద్రమూర్తికి తిర్యగ్జంతువులగు వానరములు సయితము సాహాయ్యపడినవి. అన్యాయమార్గ ప్రవర్తకుఁడై దుర్మార్గుఁడని లోకమున దూఱువడిన రావణుఁడు తన సోదరుఁడేయైనను విభీషణుఁ డతని వదలిపెట్టి శ్రీరాముని చరణసరసిజముల నాశ్రయించి ధన్యుఁ డయ్యెను. కావున, మానవున కితర విషయములకంటె గుణమే ప్రధానముగ కావలసి యున్నది.

---

## —: మతములు–పలుకుబడి :—

మన దేశమున పరస్పరవిరుద్ధములగు మతములు కలవు. వైష్ణవులను, మాధ్వులు నిందింతురు. శైవులు వైష్ణవులను

నిందింతురు. ఇట్లుండినను, ఆయా కాలములం దాయా మతా చార్యులు బయలుదేరి తమ తమ మతములను వ్యాపింపఁజేయు టకై ప్రచారము సల్పినపుడు లోకు లనేకు లాయామతములను ఆచార్యులను, అభిమానించుచు తన్మతముల స్వీకరించిరి. ఆ యా కార్యముల ముగించుటయందు ఆ యా ఆచార్యుల యొక్క గుణమే వారి పలుకుబడికి ముఖ్యకారణమైనది. పలుకు బడి సదా గుణముపై నాధారపడియున్న దేకాని, మనుష్యు నాశ్రయించి యుండుటలేదు. ఇందువలన మనకు కార్యము గుణసంపత్తివలన పరిసమాప్తి పొందుచున్నదని చరితార్థము తేలుచున్నది. పలుకుబడికి తమిళమున 'శెల్ వాక్కు' అని పేరు. అనేకులు సమ్మతించిన విషయము లన్నియు మంచివనియు, సత్య ములనియు, ఈశ్వర సమ్మతములనియు, మనవారు మెజారిటీ దృష్టాంతమును గ్రహింతురు. అనేకులు సమ్మతించిన విషయ ములు కొన్ని సమయములందు సత్యములు కాకపోవచ్చును. ఎట్లనఁగా ? త్రాగుడు అనేకజనసమ్మత మగు కృత్యమే యైనను, దానిని మనము సమ్మతింతుమా? కావున మెజారిటీ మీఁదజరుగు కార్యములన్నియు సత్యములని మన మూహించి నిశ్చయింపరాదు. చాల విచారించియే యేపనినిగాని చేయ వలయును.

---

## —: గుణము—ధనము :—

లక్షల పర్యంతము ధనమును తీసికొని వెళ్లి పాదము లపైఁ బోసినను నిరాకరించు పుణ్యాత్ముఁడు లోకమున నొకఁడు

ప్రతికాలమునందును ఉండియే తీఱును. అటువంటి మహనీయుని సాహాయ్యము చేతనే రాజు రాజ్యము చేయవలయును. పూర్వమున వసిష్ఠ విశ్వామిత్రు లట్టివారే కనుక, రాజులు వారి యనుమతమున రాజ్యమును నిర్వహించు చుండిరి. వసిష్ఠాదులు నిరీహులగు పరమర్షులు. వారి యాశ్రమమున జరిగిన రాజ్యము కనుకనే, మన మిప్పటికిని రామరాజ్యమని తలంచుచున్నాము. ధనము గుణముతోఁ గూడినపుడే ప్రకాశించును. ధనము కలవారందఱును పుణ్యము చేయుట లేదు. కాని, గుణ మున్నవారందఱును సౌఖ్యము నందుచున్నారు. అని మనము దృఢముగా నమ్మవచ్చును. గుణమన నేమి? సత్యము పలుకుట, మాతాపితరుల నారాధించుట మున్నగు మంచి నడవడులకే గుణమని పేరు. లోకమున ఒకరిని ఒకరు గౌరవించునపుడు గుణమును బట్టియే గౌరవించుచున్నారు. కాని, వ్యక్తినిబట్టి గౌరవించుట లేదు. మనుష్యుఁడా గౌరవము తనదని అనుకొనుటయు తప్పే. అట్టి సుగుణవంతులు పూర్వ మడవులం దాకలముల మేయుచు తపస్సు చేసికొనుచుండినను రాజులు వారిని వెదకి తెచ్చుకొని వారి యనుగ్రహమును బొందుచుండిరి.

---

## —: అవతారము. :—

సుగుణము లన్నియు ఆకారమునుదాల్చి లోకమున పుట్టినపుడు అవతార మనుచున్నారు. ఉదాహరణముగ మనము శ్రీరామావతారమును గ్రహించుపవచ్చును. అవతారపురు

షుఁడు ఆయా విషయములందు తన సుగుణములను జూపు చుండును. శ్రీరాముఁడు పరమసహనబుద్ధితో పడరానిపాట్లు పడియున్నాఁడు. అట్టి కష్టసమయములందును అతఁడు శాంతమును గోలుపోయి అధర్మమార్గమున చొరలేదు. అతని కష్టమంతయు పితృవాక్య పరిపాలనార్థ మేర్పడినదే. పెద్దలయెడ మనము అడఁకువ కలిగి యుండవలయును. తండ్రి చెప్పిన కార్యమును విచారింపక పరిపాలనోద్దేశమునే ప్రధానముగ నుంచుకొని వారి ఆజ్ఞను పరిపాలనము చేయవలయును. ఆ యాజ్ఞయందలి పుణ్యాపాపముల విచారము మన కనవసరము. మనప్రియము సదాగుణమునందే వర్తిల్లుచుండును. అవగుణమును లోకము సన్మానింపదు. 'రామ ఇవవర్తితవ్యం' అనియే మనకు పురాణములు బోధించుచున్నవి. మనము పురాణములందు ప్రమాణబుద్ధిని వదలిపెట్టరాదు. ధర్మములను శాసించుటకు ధర్మశాస్త్రము లున్నవి. వానినుండి మనము ధర్మములను తెలిసికొనిన చాలదా? ఏల? ఈ పురాణములని కొందఱందురు. ధర్మముల నూరక ఉపన్యసించుటకంటె ఆ ధర్మములను ఒక చరిత్రమూలమున మనము తెలిసికొనినపుడు మఱింత బాగుగ మనసున నాటును. ఇదియే పురాణముల తత్త్వము. మనము గుణము నభిమానించువారము. కనుక, ఆగుణమునే మనమును సంపాదింపవలయును. ఈ గుణము మనకు లోభవర్జనమునఁగాని కలుగనేరదు. లోభమును వర్జించిన తరుణమున మనకు గలుగు ఆనందమందలి పదునాఱవ యంశమునైనను మనము స్వర్గమం

దును, మనుష్యుఁడు కోరఁదగిన యితర సకల సుఖములందును పొందనేరము. కావున, లోభ త్యాగమునకంటె శ్రేయోనిదానమగునది మఱొకటి లేదని మనము చక్కఁగ గ్రహింపవలయును.

---

## —: చరిత్ర గ్రంథములు. :—

మన దేశమున ఇంగ్లీషుభాషను కఱపు బడులలో దేశోచారిత్రగ్రంథములందును పిల్లలకు పాఠము చెప్పుదురు. వానియందు మన దేశచరిత్రనుగూర్చి ఉన్నదున్నట్లుగను, నిశ్చయముగను తెలియఁజెప్పు చారిత్రక గ్రంథములు తఱచుగా లేవనియే చెప్పవచ్చును. అందును మన దేశమును గుఱించిన చరిత్రకంటె అన్య దేశముల చరిత్రనే బాలురు ఎక్కుడుగా చదువవలసిన పద్ధతికలదు. ఆ చరిత్రవలన ఏండ్లతరబడిగ ఆంగ్లేయులందును ఇతర దేశీయులందును గల మార్పులను వేషభాషల వ్యత్యాసములను మనము తెలియఁగలము. అటులే మన దేశచరిత్రలందు ఏండ్లతరబడిగ వేషభాషలందుఁ గల మార్పులు తెలుపఁబడలేదు. కారణమేమనఁగా? నాఁటి నుండి నేఁటివఱకు మనవారు ఒక్క విభూతి, నామము, మున్నగు తిలకములనే ధరించుచున్నారు. ఒకటేవిధమున బట్టలను గట్టుచున్నారు. ఒకటే భాషలను మాట్లాడుచున్నారు. ఇందువలన మన వేషభాషలును, జాతి మతములును, మధ్యలో ఎన్నివిప్లవములు కలిగినను నేఁటివఱకు సంరక్షింపఁబడుచునే యున్నవి. ఎన్నడును తారుమారులు పొందలేదు. దీని

చేతనే మనధర్మములన్నియు అనాదిగ వచ్చుచున్నవనియు, మారుబాటులతో మనకవశ్యము లేదనియు, అంతేకాక, అందు వలన ప్రత్యేకప్రయోజనమును ఉండఁబోదనియు, మనము చక్కఁగ తెలిసికొనవచ్చును. మనమతములకు మన దేశమున నిపుడు గొప్ప విషమపరీక్షాసమయము తటస్థించియున్నది. ఆ విషయమును మీరెల్ల రెఱుంగుదురు. ఇట్టి విపత్సమయ మున మనలను, మన మతధర్మములను, కాపాడుటకై మన మెల్లరము, సనాతనుండును, దయాసముద్రుండును అగు శ్రీ పరమేశ్వరుని ప్రార్థింపవలయును. మన సనాతనధర్మమునకు చేటువాటిల్లు కాలమున 'మన కేమి?' యని మన మూరకుండ రాదు. అట్లు మన మూరకుందుమేని లోకమునకు మిక్కిలి అపకార మొనరించినవారల మగుదుము. వెనుక రానున్న వారిదూషణములకు పాత్రులమగుదుము. ఒక్క విషయమునకు మాత్రము మనము సంతసింపవలసి యున్నది. ఎట్లనఁగా? సనాతనధర్మము తలక్రిందగుకాలమున మనమును పుట్టియుంటి మను విషయమునకు మాత్రమే. కావున మనమెల్లరమును మనధర్మములను రక్షించుటయందు జాగరూకులమై మెలఁగ వలయునని హెచ్చరించుచున్నాను.

---

## —: ధన సంచయము :—

మానవుఁడు తన జీవనము నడుపుకొనుటకును, లోకోప కారము చేయుటకును, డబ్బును సంపాదించుచున్నాఁడు. కాలు

సేతు లుడిగినతర్వాత జీవనము నడుపుటకును ఇప్పటినుం
డియే జాగ్రత్త పడుచున్నాఁడు. జంతువుల కిట్టికష్టము లేదు.
అవి ఆయా దినమాహారమును వెదకికొనుచున్నవి. రేపటి
విచారము వానికిలేదు. శీతోష్ణములను సహించుటకు ఒడలం
తయు ఆ యా జంతువిశేషములకు తగినటుల ఉన్ని, ఈఁకలు
మున్నవాని నీశ్వరుఁ డనుగ్రహించియున్నాఁడు. కావున, వానికి
కడుపుపని విచారించుకొనుట తప్ప, మఱొక విచారము లేదు.
మానవున కెన్నియో విచారములు కలవు. వాని జీవితము
వానితోనే ముగియదు. పుత్త్రపౌత్త్రాదుల క్షేమాభ్యుదయము
లను విచారింపవలసినవాఁడై యున్నాఁడు. కావున, కొన్ని
విషయములందు పశ్వాదులే మనకంటె మేలుగ నున్నవి. ఇంత
టితో పోవుటలేదు. మానవుఁ డెన్ని సంపాదించినను అవి వీని
తోడ వచ్చుటలేదు. దేహము వదలినపిమ్మట మనుష్యుఁ
డెన్నియో కష్టముల ననుభవింపవలసి యున్నాఁడు. ఆ విష
యమును గుఱించియే శాస్త్రములు మనలను హెచ్చరించు
చుండును. కావున, మానవుఁ డిప్పుడే దానికి తగిన ఉపాయ
మును వెదకికొనవలెను. ఈ తరుణమును వదలి తర్వాత
విచారపడిన ప్రయోజనము కలుగఁబోదు. అస్థిరములగు నీ
శరీర ధనములచేతనే శాశ్వత సౌఖ్యమునకై మార్గము వెదకి
కొనవలయును. దేనిని మనము ధనమని రేయింబవళ్లు కావలి
కాయుచు తల్లడిల్లుచున్నామో ఆధనము మనకు పరలోక
మున చెల్లదు. సోమరియగు పిల్లవాఁడు బడికివెళ్లి విద్యాభ్యా
సముచేయక ఎట్లు శ్రేయస్సును చెడఁగొట్టుకొనుచున్నాఁడో

అట్లే మనమును శాశ్వత సుఖమునకై యిపుడే ప్రయత్నింపక తర్వాత చింతిల్లెదము. ప్యారిసువాఁడు జర్మనీకి వెళ్లవలసినపుడు వాని నాణెము లాయూరిలో చెల్లుబడి కానేరవు. కనుక ముందే జర్మనీ నాణెములను మార్చి యుంచుకొనును. అట్లే యీ ధనముచేత మన మీ జన్మముననే పరలోకసాధనమై, మనతోడ రాఁదగిన ధనమును సంపాదించికొనవలయును. ఆధనమునకే మనశాస్త్రములందు ధర్మమని పేరు. ఈ ధర్మ మనెడి ధనముతోడ మన మాలోకమున నెల్ల సుఖములను బొందవచ్చును. 'అయ్యో! ధనములేనివాని గతి యే'మని మీరు నన్నడుగవచ్చును. అందులకై విచారపడ నవసరము లేదు. లోకమున నెల్లరు ధనవంతులుగనే యుండరు. దరిద్రులును ఉందురు. వారు శరీరముచేత ధర్మమనెడి ధనమును సంపాదించి కూడఁబెట్టుకొని పరసౌఖ్యము నందవచ్చును. శరీరమును ఆత్మయందు వినియోగించి ధనవంతులకంటె నెక్కుడుగ ధర్మమును సంపాదింప వచ్చును. మన స్మృతులలో మనుస్మృతి యనునది చాల గొప్పగ్రంథము. దాని నీ కాలమున పలువురు ద్వేషించి అగ్నిదగ్ధము చేయుటచేతనే దాని మహిమము మనకు మఱింత వెల్లడియగుచున్నది. అఱువది మువ్వురు నాయనారులలో చేరినవా రొకరు మనుస్మృతిప్రకారము రాజ్యముచేసి కైవల్యమునందిరి. కావుననే వారికి 'మనునీతినాయనార్' అను పేరు కలిగినది. గోవు మనకు చాల పవిత్రమగు జంతువు. ఒక కబళము గ్రాసమునైనను శరీరకష్టముచేత సంపాదించి ప్రతిదినము మన మా గోసేవ

చేయవలయును. లేదా ? ప్రతిదినము దేవాలయమునకు వెళ్లి స్వామికైంకర్యము నెద్దియైన చేయుట. దేవాలయమున అపరిశుద్ధ పదార్థములను లేకుండచేయుట. మున్నగు కార్యములందు మన శరీరమును వినియోగింపవలయును. దరిద్రుని కిట్టి సేవయే పరమపవిత్రమైనది. ఈ సందర్భమున మనువు సయితమిట్లు వక్కాణించియున్నాఁడు. చూడుఁడు. 'ధనవంత మదాతారం దరిద్ర మతపస్వినం, కంఠమధ్యే శిలాం బధ్వా సింధుమధ్యే వినిక్షిపేత్.' ఇందువలన మనువుయొక్క ఆశయమును చక్కఁగ తెలియఁగల్గు చున్నాము. కావున మనము 'యచ్చ కామసుఖంలోకే యచ్చదివ్యం మహత్సుఖం తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతష్షోడశీం కలాం' అన్నట్లు లోభమును వదలి గోసంరక్షణాది కార్యములచేత మన ధనమును, శరీరమును, సార్థకముచేసి కొనవలయును. లోకోపకారకమయిన కార్యము ఒక్కటియైనను మన మీ జీవితమున సాధింపవలయును. అట్లు కాక, క్రిమికీటాదులవలె నిరర్థకముగ పుట్టి చచ్చుటవలన లాభము లేదు. ధర్మ సంపాదనమున కింతకంటె అనువగు జన్మ మనకిఁక లభియించునని తలంపరాదు. మీర లెల్లరు ఇట్టి ధర్మమును జరిపి పరమేశ్వరానుగ్రహమును బొందుదురని యాశించుచున్నాను.

---

—: షణ్మాతములు :—

శ్రీమదాది శంకర భగవత్పాదులు భరతఖండము నంతయు ప్రదక్షిణముచేసి బదరీనారాయణము నుండి

కాంచీ మండలమునకు దయచేసిరి. వా రచటనే షణ్మతము లను స్థాపించినటుల మనము తెలిసికొనుచున్నాము. శైవము వైష్ణవము, శాక్తము, సౌరము, గాణాపత్యము, కాపాలికము అను ఆఱింటికే షణ్మతము లనిపేరు. శక్తి సంబంధమగునది శాక్తము. సూర్య సంబంధమయినది సౌరము. గణపతి సంబంధమయినది గాణాపత్యము. కపాలి సంబంధమైనది కాపాలికము. ఇన్నిటియందును పరమార్థరూపమయినది అద్వైతము. తొలుఁదొలుత మనము శైవాద్వైతమును గుఱించి ముచ్చటింతుము గాక !

## —: శైవాద్వైతము :—

పశువు, పతి, పాశము, అని శైవాద్వైతమున మూఁడు విషయము లున్నవి. పశువులకాపరి తనపశువులు విచ్చలవిడిగా సంచరించినచో వానిమూలమున లోకమునకును, లోకమువలన తనకును కష్టనష్టములుకలుగునని యెంచి పలువులచే కట్టి యుంచుచున్నాఁడు. అట్లే ఈశ్వరుని దృష్టియందు మనమెల్లరము పశువులము. అనఁగా, శివజ్ఞానము లేనివారము ఆయన మనకుపతి. అనగా అధికారి. పాశమే ఆశ. అనఁగా ఆశయనెడి పాశమునకు మనము కట్టుబడి యున్నాము. ఈ తత్త్వము శివాగమములందు విస్తారముగ కలదు. ఇవి మన వేదములందు అక్కడక్కడ పొత్తుగా నున్నవి. పశువుల

నెందులకు యజమానుఁడు కట్టియుంచునదియు, ఇదివఱకే చెప్పి తిమి. మనుష్యులను మనము సాధారణముగ ఎప్పుడు కట్టి యుంతుము? అనఁగా బాల్యమునందును, పిచ్చిపట్టినపుడును. ఏల? అదియును వారి క్షేమమునకే. అట్లే పరమేశ్వరుండును పశువులమగు మనలను కట్టియుంచి యున్నాఁడు. కట్టిపెట్టుట యననేమి? ఆశకు మనము బద్ధులై యుండుటయే. లోక మున ఒక్కని ఆశకే మూఁడు లోకములును చాలవు. అంద ఱును ఇట్లే ఆశపడుచుండిన ఈశ్వరుఁడు వేఱు లోకములను సృజియింపవలసి యుండును. ఒక్క విషయమును లోభగుణ ముచే మనము సదా చింతించుచుందుమేని, తుదకది విపరీతము గానే ముగియును. కావున అధికాశను వదలుటయే మంచిది. ఆ ఆశయే పాశమనఁబడును. పాశమననేమి? న్యాయము కానిదియు, అవశ్యము కానిదియు, మనము నివృత్తి చేయుటకు వీలు లేనిదియు, అగునది యేదియో అదియే పాశము. అయితే ఆ పతి యీ పశువుల నెప్పుడు విడుచుచున్నాఁడని మన కొక సంశయము కలుగును. కొన్నిటిని జన్మ పర్యంతము విడు చుటలేదు. కొన్నిటిని కొన్ని దినములకే విడిచిపెట్టుచున్నాఁడు. అది యిది యననేల? పశువు ఎప్పుడు పతి నెఱుఁగునో అపుడే పాశమును వీడుచున్నది. దీనికే మోక్షమని పేరు. ఆశబ్దము నకు విడివడుటయని యర్థము. ఆ కట్టువలననే మన యిష్టము లన్నియు సిద్ధింపక పోవుచున్నవి. 'వయంతు పశవోఽస్మాకం ఈశ్వరః' అనియు 'జ్ఞానీతు ఆత్మైవ మే మతః' అనియు యిం దులకు ప్రమాణవాక్యములు. ఆశ లేకపోవుటయే శివసాయుజ్య

మనంబడును. దీనినే పశువును పతితో కలుపుటయని శైవ సిద్ధాంతమందు చెప్పుచున్నారు. పాశము లేనివాఁడు పతియగు చున్నాఁడు. శివాగమములు ఇరువదియెనిమిది విధములనియు, ఆయాగమములు చర్య, క్రియ, యోగం, జ్ఞానం, అని మఱల నాలుగు విధములుగ నున్నవనియు, శ్రీకంఠ శివాచార్యులవారి భాష్యగ్రంథములు చెప్పుచున్నవి. చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు, అని వైష్ణవ విశిష్టాద్వైతము. పేరులు వేఱువేఱుగ నున్నవే కాని విషయములు రెంటియందును ఒక్కటియే. రెండును వేఱు వేరైనపుడు శైవవిశిష్టాద్వైతము, వైష్ణవ విశిష్టాద్వైతము, అని చెప్పఁబడుచున్నవి. రెండును ఒక్కటి అయినపుడు అద్వైత మనఁబడుచున్నది. ఇట్లే షణ్మతములందలి యద్వైతమును మనము తెలియవలసి యున్నది.

## —: ద్వైతాద్వైతము :—

ఒక్క దీపముపై వేయికంతలు గల కుండను మూసి నపుడు పెద్ద రంధ్రమునుండి వెలుతురు అధికముగ తెలి యును. అట్లే విశేషజ్ఞులగువారు లోకమున పెద్దలనఁబడు చున్నారు. చిన్న రంధ్రములనుండి వెలుతురు కొద్దిగా తెలి యును. అట్లే కొద్దిగా తెలిసినవారిని సామాన్యు లను చున్నాము. ఆ కుండను భేదించి ఆదీపప్రకాశము నెవ్వరు సంపూర్ణముగ చూడగల్గుచున్నారో వారే మహాత్ములని పేర్కొ నఁబడుచున్నారు. ఈ దేహము తాననియు, తనకంటె ఈశ్వ రుఁడు పరుండనియు ద్వైతితలంచుచున్నాఁడు. ద్వైతి దేహ బుద్ధితో నేను నీకు దాసుఁడ ననును. జీవబుద్ధితో నీయంశమని

పుం. క్ర్రం.



విశిష్టాద్వైతి చెప్పను. అద్వైతి ఆత్మబుద్ధితో నీవే నేనను.
ఉపాసనాకాండమందు హరిహరాద్వైతమును జ్ఞానకాండము
నందు జీవబ్రహ్మ ద్వైతమును, చెప్పఁబడి యున్నవి.

—: పంచదీక్షలు :—

ఈ భరతఖండమున విష్ణ్వాలయముల కంటె శివాలయ
ములే అధికముగ నున్నవి. నూటయెనిమిది దివ్యతిరుపతులని
యు, వేయిన్నియెనిమిది శివాలయములనియు ఒక్క గ్రంథమున
పేర్కొనఁబడియున్నది. యోజించి చూడఁగా శైవమే అన్ని
మతముల కాధార మగుచున్నది. కొందఱు విభూతిధారణమును,
దూష్యముగ భావించినను విభూతిని ధరించుచునే యున్నారు.
ఎట్లనఁగా? హవ్యకవ్యములందు హోమముచేసిన పిదప రక్షాధార
ణమని విభూతిని పెట్టుకొను ఆచారము కలదు. మంత్రములు
పురాణోక్తములు, వేదోక్తములు అని భేదముకలవిగ నున్నవే
కాని, సకల మతముల వారును, సకల జాతుల వారును, విభూతిని
నుదుట పెట్టుకొనవలసియే యున్నారు. భస్మమును ముఖమున
నుంచికొనుట కంఠమున గురుదత్తమగు రుద్రాక్షను ధరించి
కొనుట, నాలుకచే పంచాక్షర మంత్రమును జపించుట,
బిల్వముతో దేవుని పూజించుట, బాణలింగమును అర్చిం
చుట, వీనికే పంచదీక్ష లని శైవసిద్ధాంతమున చెప్పఁబడి
యున్నది.

—: బాణము–బిల్వము :—

నర్మదానదీమధ్యమున ఓంకారకుండ మని యొక
కుండము కలదు. ఆ కుండమునఁ బుట్టినజాలకే బాణలింగము

లని పేరు. లింగముయొక్క మాహాత్మ్యము మున్ముందు చెప్పఁబడును. శ్రీ సూక్తమున బిల్వము లక్ష్మీపరముగ పేర్కొనఁబడియున్నది. బిల్వఫలమునకు శ్రీ ఫలమనియు పేరుకలదు. 'బిల్వనిలయాయై నమః' అని లక్ష్మీసహస్రనామ స్తవమున నొక్కనామము కలదు. [ప్రదోషసమయమగుటవలన నేఁడు కేవలము శైవాద్వైతమును గుఱించి మనము విచారించితిమి. ప్రతి ప్రదోషసమయమందైనను మీర లందఱు శివాలయమునకు వెళ్లి పరమశివుని సేవించి ధన్యు లగుదురుగాక! యని యాశించుచున్నాను.]

## —: కార్య కారణములు :—

సాధారణముగ లోకమున నొక వస్తువును గుఱించి విచారించుచో దాని పూర్వోత్తరములను మనకు తెలుపువారు లేరు. ఒక్క పుష్పము నుదాహరణముగఁ దీసికొన్నచో దాని రక్త శుక్ల పీతాదివర్ణములను గుఱించియు, ఉత్పత్తిని గుఱించియు, మనము ప్రశ్నింపఁగా, బదులుచెప్పువారు లేరు. ఇట్లే పర్వతాదులను గుఱించియు మనము తెలియఁజాలము. ఒకకీటకము మృగమున కెట్లే విషయములు తెలియవో, అట్లే మనమును తెలియనివారుగనే యున్నాము. లోకమున మనకు తెలిసిన విషయములకంటె తెలియని విషయములే మెండుగా నున్నవి. అయితే మనము అన్నియు తెలిసినవారివలెనే సంచరించుచున్నాము. ప్రస్తుతపు ప్రకృతిశాస్త్రములు, జంతుశాస్త్రములు మున్నగునవికూడ మన కీవిషయమును తెలుపుటలేదు. అవి యేవో వెఱ్ఱిమొఱ్ఱిగా చెప్పుచుండును.

అంతేకాక, మనబుద్ధిని గూడకలవరపెట్టుచుండును. ఏది యెట్లున్నను పదార్థతత్త్వవివేకము మనకు కావలసియున్నది. ఈప్రపంచ మిట్లు చిత్రవిచిత్రములుగ నుండుట కొక కారణ ముండియే తీఱవలయును. ఇదంతయు స్వభావసిద్ధమనెడి యిప్పటి ప్రకృతిశాస్త్రవేత్తలవాదములతో మన కెంతమాత్రమును ప్రయోజనము కలుగఁబోదు. ఒకచోరుఁడు గృహమునుండి వెడలిపోయినపుడు వాని కాలిజాడలు మున్నగు గుఱుతులతో వాని నెట్లు కనిపెట్ట ప్రయత్నింతురో, అట్లే మనమును ప్రపంచమనెడి యీకార్యమునుబట్టి పరమేశ్వరుఁడనెడి కారణమును తెలియవలసియున్నది. ఆ పరమేశ్వరునియొద్ద మన కనేకకార్యములు కలవు. అయితే వాని యునికి మనకు తెలియుటలేదు. 'గుహాయాం నిహితం' అని మనకు శ్రుతి వాని జాడను బట్టియిచ్చుచున్నది. అనఁగా వాఁడెచటనో గుహలో దాఁగియున్నాఁడఁట. 'ఇంత విస్తార మగు ప్రపంచమును నిర్మించుట కొక్కఁడు చాలునా? పెక్కుమంది చేరి యీ కార్యమును చేసియుందు' రని మనలో పలువురనుచున్నారు. అట్లే పెక్కుమందిచేరి యీ కార్యమును చేసియుండినచో, అదేపనిగా వెదకువారికైనను ఆ పెక్కుమందిలో ఒక్కఁడైనను కాన్పించక పోవునా? కావున, ఇంతటి కార్యమును ఎవ్వఁడో ఒక్కఁడే చేసి యుండవలెను.

## —: లింగము అనఁగా నేమి? :—

వాఁడు మనకన్నులకు తెలియుటలేదు. కావున మనకు ఒక్క గుఱుతు కావలసియున్నది. గుఱుతునకే సంస్కృత

మున లింగమని పేరు. ఎట్లనఁగా? ఆకసమున మేఘము గర్జించునపుడు మనమింటిలో నుండియే ఆకసమున మబ్బు వేసి యున్నదనియు, వర్షము కురియుననియు గ్రహింపఁ గల్గుచున్నాము. ఆ గర్జనమునకే లింగ మనిపేరు. మఱొక దృష్టాంతము. ఏమనఁగా? ఇంటిపైఁ పొగ లెగయునపుడు ఇంటిలో నిప్పుడున్నదనియే మనము నిశ్చయించుచున్నాము. ఆ ప్రకారము ఎపుడును మన కన్నులకు తెలియని దొక్కటి కలదు. లేదనుకొందమా? వీలు లేదు. దానికి లింగమున్నది. దీనినే అనుమానప్రమాణ మని సంస్కృతమున చెప్పుదురు. పై చెప్పిన గుఱుతును మనము పరిపరివిధముల పోనీయక ఒక్క చోటనే యుంపవలయును మన కన్నులకు తెలియు నీ గుఱుతుచేత తెలియని వానిని కనిపెట్టవలయును. వాని స్వరూపమిట్లే యుండునని నిశ్చయించుట కెట్టి లింగము కావలయునో అట్టి లింగమును మనము సంపాదింపవలయును. అట్టి లింగము లందు స్ఫటికలింగము శ్రేష్ఠము. ఏలనఁగా? ఈశ్వరుఁడు రూపనామాదులు లేనివాఁడని వేదములు చెప్పును. స్ఫటికము కూడ నట్టిదే. ఎఱ్ఱపువ్వులో నుంచిన, నదియు ఎఱ్ఱగా కాన్పించుచున్నది. బిల్వముతో కూడినపుడు పచ్చగా కాన్పించుచున్నది. చరితార్థ మేమనఁగా? అది వర్ణశూన్యమైన దనియేకదా? పీఠము బ్రహ్మస్వరూపమనియు, పాణివట్టము విష్ణుస్వరూపమనియు, పై భాగము శివస్వరూపమనియు, లింగము మూఁడు భాగములుగ పేర్కొనఁబడినది. శ్రీకాళహస్తిలింగము మాత్ర మిట్లు లేదు. అది సాలెపురుగు,

సర్పము, ఏనుఁగుదంతములు వీని యాకారముతో నున్నది. శ్రీ కాళహస్తికి దక్షిణమున ఇఱువదిమైళ్ల దూరమున గుడిపల్లి మను నొక దివ్యక్షేత్రముకలదు. అది సాధారణముగ అడవి యందున్న దనియే చెప్పవచ్చును. అచటి లింగము, చిత్రసేన, పరశురామ, శివస్వరూపములతో నున్నది. ఇందులకు కారణము నా స్థల పురాణమున విచారించి తెలియునది. ఇటే రావిచెట్టును ధ్యానించునపుడును, "మూలతో బ్రహ్మరూపాయ" అని మనము త్రిమూర్త్యాత్మకముగ స్తోత్రము చేయుచున్నాము.

---

—: పంచాయతన పూజ :—

కేవలము శివలింగమును పూజచేసి దాని నిర్మాల్యమును గ్రహించుట దోషమని మన శాస్త్రములందు కలదు. కావుననే, పంచాయతనపూజ విధింపఁబడినది. [ ఆలయములలో మనము గర్భాలయమును ప్రవేశింపరాదు. అచటి తీర్థము మున్నగు మహాపదార్థములను మనము త్రొక్కుదు మనిరో యీవిషయము నిషేధింపఁబడినది.] ఏవిషయమునకైనను మనము చాల దూరమున నున్నను ప్రయోజనము లేదు. కేవలము సమీపించినను ప్రయోజనము లేదు. మితముగ నొక్కగుఱుతునుంచికొని, కారణ స్వరూపుఁడగు పరమేశ్వరుని యనుగ్రహమును బొందవలయును. ప్రస్తుతము విచారింతము. ఆదిత్యుఁడు, అంబిక, విష్ణువు, గణనాథుఁడు, మహేశ్వరుఁడు, అను వీరికే పంచాయతన మని పేరు;

వీరి నైదుగురిని పూజించి తీర్థప్రసాదములను పుచ్చుకొని, మనుష్యుఁడు కృతార్థుఁడు కావలయును. యోజించి చూడఁగా మన హిందూదేశమే పంచాయతన రూపముతో నున్న దనవచ్చును. ఎట్లనఁగా? తంజావూరిలో నొకచోట స్ఫటికములు పుట్టుచున్నవి. నర్మదానదిలో బాణము కల్గుచున్నది. శోణభద్రయను నదిలో ఎఱ్ఱని శిలలు పుట్టుచున్నవి. అవియే గణపతి రూపముగ భావింపఁబడుచున్నవి. నేపాళమున గండకీనదియందు సాళిగ్రామము పుట్టుచున్నది, అళి యనఁగా పురుగు, ఒకవిధమగు ఆ పురుగు గ్రావమునందు అనఁగా శిలయందు చక్రములను తొలుచుచున్నది. శ్రీ కాళహస్తియందలి సువర్ణముఖిలోని ఎఱ్ఱని శిల అంబికాస్వరూపముగ పూజింపఁదగియున్నది. దీనికి శివపంచాతన మని పేరు. ఇట్లే గణపతిని ప్రధానముగ నుంచికొనిన గణేశ పంచాయతన మగును. తక్కినవాని నిట్లే యూహించి తెలియునది. ఈశ్వరుఁ డాకార రహితుఁడని తెల్పుటకే నర్మదాబాణ మేర్పడినది. కాలమునకు మొదలుతుదలను చెప్పుట ఎట్లు అసాధ్యమో, వర్తులమునకు (సున్నకు) మొదలు చివరలను కనిపెట్టుట ఎట్లు కానిపనియో, అట్లే ఈశ్వరుని ఆద్యంతములును, అగోచరములుగ నున్నవి. లింగాకారమునే యింగ్లీషులో క్యూబిక్ సర్కిల్, అని చెప్పుచున్నారు. 'న న్నేరూపముతో ధ్యానించిన ఆ రూపమును ధరింతుననియు, ఈ ప్రపంచము నా వలన సృష్టింపఁబడిన మాయయనియు, దీనినే నిశ్చయమని తబ్బిబ్బు

పడకు మనియు శ్రీ భగవానుఁడు శ్రీ నారదునకిట్లు చెప్పెను.
"మాయా హ్యేషా మయా సృష్టా య న్మాం పశ్యసి నారద,
సర్వభూతగుణైర్యుక్తం నైవం మాం యాతు మర్హసి" సకల
భూతములందును, భక్తుల సౌకర్యము కొఱకు నేను గుణ
స్వరూపుఁడుగ నున్నాను. అని పరమేశ్వరుఁడు చెప్పుచున్నాఁడు.
నిర్గుణమగు తత్త్వమునకే వేదాంతమని పేరు. దానిని తెలి
పెడి మార్గమునకే సిద్ధాంతమని పేరు. కావున మీరెల్లరు పం
చాయతన విధానమున ఈశ్వరారాధనము నొనరించి కృతా
ర్థులరగుదురుగాక! యని యాశించుచున్నాను. (ఇంకను శ్రీవారు
తులాకావేరీ మాహాత్మ్యమును గుఱించియు, మధ్యార్జున
మహాత్మ్యమును గుఱించియు, గాణాపత్యము, మహారాష్ట్ర
దేశమున విస్తారమనుటను గూర్చియు, మయూరపంతు అను
మహారాష్ట్ర కవిని గుఱించియు విపులముగ చెప్పిరి. విస్తర
భీతిచే వాని నిట వదలిపెట్టితిని.)

---

## * —: ఆంధ్రభాషా విశేషము :—

ఒక ప్రాణియొక్క హృదయమందుండెడి భావమును
మఱొక ప్రాణికి తెలియపరచుటకు వాక్కు ముఖ్యసాధనము.
వాక్కు అనునది శబ్దరూపము. శబ్దమనునది వ్యక్తమనియు,
అవ్యక్తమనియు రెండువిధములనున్నది. వ్యక్తమనఁగా శుద్ధము

* ఈ యుపన్యాసమును బ్ర॥ శ్రీ కంచిభొట్ల, జగన్నాథంగారు
(బి.ఎ.) వ్రాసిరి. వారి యనుమతమున నిది యిందుఁ జేర్పఁబడినది. శ్రీవా
రీ యుపన్యాసమును మైలాపూరులో నుండినపుడు ఆంధ్రమున నొనర్చిరి.

గను, తుల్యముగను, చక్కఁగా తెలియునట్లును ఉండునది. అవ్యక్తమనునది తుల్యముగా కనుపింపనిది. మన గృహాము దాక గోవు 'అంబా' యని యరచును. అప్పు డది తన దూఁడను చూచిన సంతోషముచేత యఱచిన దనియో లేక యాహారము కావలయునని యరచిన దనియో మనము తెలిసి కొందుము? శబ్దముయొక్క భేదముచేత వ్యక్తమో, యవ్యక్తమో యేర్పడుచున్నది. అనఁగా, హృదయభావము స్వర భేదములచే తెలియుచున్నది. శబ్దముల స్వరభేదములను మనకు జ్ఞాపకముచేయుటకై అకారాది క్షకారాంతము గల యక్షరములు సంకేతములుగా నేర్పడియున్నవి. భాష యొక్క స్థూలరూపము లక్షరములు. లోకమందు అవ్యక్త భాష లనేకములుకలవు. అవ్యక్తమును మ్లేచ్ఛమందురు. ఇంగ్లీషు సయితమొక మ్లేచ్ఛభాషయే. ఇయ్యక్షరమున కీయుచ్చారణమే యను వ్యవస్థ ఆభాషకులేదు. 'సి' యనెడి యక్షరము 'క' యనెడి శబ్దమునకును, 'స' యనెడి శబ్దము జెప్పుటకును ఉపయోగింతురు. ఒకే యక్షరము లనేకశబ్దముల కుపయోగించునటుల, యొకే శబ్దము లనేక యక్షరంబుల తెలుపు నట్లుదాహరణములు గలవు. 'స' యనెడి శబ్దము 'సి' యనెడి యక్షరముచేతను, 'ఎస్' అనెడి యక్షరములచేతను దెల్పనగును. 'యు' అనెడి శబ్దము 'బట్' యనెడి మాటలో 'అ' కారోచ్చారణయు 'ఫుట్' యనెడి మాటయం దుకారోచ్చారణయు కలిగి యున్నది. ఒకశబ్దమున కొక్కయక్షరమే క్రమము. మన

భాషయం దక్షరములు తెలియునేని యుచ్చారణ కష్టము కాదు. సంస్కృతమనఁగా, సంస్కారము జేయఁబడినదని యర్థము. అక్షరములు మొదలు 'అ' యను దానిని, తుదియక్షరము 'క్ష' యను దానిని కలిగియుండుటచేత అక్షరము లనఁబడు చున్నవి. సంస్కృతమం దన్నిశబ్దంబు లున్నవి. అయితే అఱవము, ఫ్రెంచి, చీనా భాషలలో మాత్రమే ழ యనెడి యక్షరమున్నది.

అక్షరముల వరుసకు అక్షరమాలిక యని పేరుగలదు. అక్షమాలిక యనునది వేఱు. జపమును లెక్కించుటకు అక్షమాలయను నదొక ఉపాయము. రుద్రాక్షమాల, స్ఫటికాక్షమాల, యనెడి పదములలో అక్షమాల యనెడి మాట కలిసియున్నది. అది యటుండ, సంస్కృతమందు 'అ' కారమునకును. 'క్ష' కారమునకును మధ్య అన్ని శబ్దములు వచ్చుచున్నవి. అయితే యక్షరమాలికయందు ழ ('ఎఫ్, యిక్,) F. ழ. ఁ, యనెడి యక్షరములు లేవుగాని, కొన్ని చోట్ల నీ శబ్దములువచ్చు అక్షరములుగల ప్రస్తాపశబ్దములు సంస్కృతమం దంతర్భావముగా నున్నవి. అక్షరములకు వర్ణములనియు పేరుకలదు. వర్ణమను పదమునకు మూఁడర్థములు గలవు. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనిచెప్పునప్పుడొకయర్థము; నలుపు, ఎఱుపు, పసుపు అనెడి రంగులఁ బేర్కొనునప్పుడొక యర్థము; యక్షరము లనునప్పుడు వేఱొక యర్థమును అగును.

సంస్కృతభాషయం దనేక అక్షరములుగలవు. బం

గాళీభాషయందలి యక్షరములు ; గుజరాతి భాషయం దక్ష రములు ; తెనుఁగు భాషయం దక్షరములు ; మహారాష్ట్ర భాషయం దక్షరములు ; గ్రంథాక్షరములు మొదలగునవి. సంస్కృతభాష నీలిపులయం దా యా ప్రదేశములలో వ్రాయు చున్నారు. తమిళభాషయం దుండెడి తిరువాయ్ మొళిని తెనుఁగు దేశీయులు పారాయణ మొనర్చుటకయి తెనుఁగక్షరములతో వ్రాసియున్నారు. ఒకభాష కనేకలిపులున్నటులనే ఒకలిపి యం దనేకభాషలున్నవి. ఇంగ్లీషు లిపికి రోమన్ లిపి యనుపేరు. ఆయక్షరములలో ఆంగ్లము, ఫ్రెంచి, మొదలగు భాషలను వ్రాయుచున్నారు.

భాషల యం దాంధ్రభాషకును, దాని లిపికిని ఒక గొప్ప మహిమ కలదు. తెనుఁగక్షరములు ఎడమప్రక్కగా వ్రాయఁబడుచున్నవి. పరదేవతయును, పరమశివుని కెడమ వైపున నున్నది. కాఁబట్టి యియ్యాంధ్రభాషయం దక్షర ములు మహాశక్తివంతములైనవి. భాష శివస్వరూపమైనది.

దక్షిణదేశమం దారణి సమీపమున నొక యూరుగల దు. ఆ యూరియందు అప్పయ్యదీక్షితుల నెడి గొప్ప శివభక్తు లుండిరి. శివభక్తిమహిమను వారు స్థాపించిరి. పిదప వారే శ్రీకంఠాచార్యులుగా నవతరించి శ్రీకంఠభాష్యంబుచేసిరి. శివ మార్గప్రతిష్ఠాపనాచార్యుఁడనియు వారికి పేరుగలదు. అప్పయ్య దీక్షితులు సామశాఖ నధ్యయన మొనర్పవలసిన కుటుంబమం దుద్భవించిరి. దీక్షితులవారు తనను 'తెనుఁగుభాషను మూ ర్ఖుడు వానినిగాను, యజుర్వేదీయుని గాను, ఈశ్వరుఁడు



శ్రీవారు స్నానానంతరము కాషాయ
వస్త్రమును ధరించుట.

పుట్టించ లేదని దుఃఖించెడివాఁడను’అభిప్రాయము నొక శ్లోకములో వారే వ్రాసియున్నారు.

ఆంధ్రదేశమునకు త్రిలింగదేశమని పేరు. శ్రీకాళహస్తి శ్రీశైలము ద్రాక్షారామము అనెడి మూఁడు స్వయంభులింగంబులు గలిగిన క్షేత్రంబుల నెల్లలుగా కలిగినది మన యాంధ్రదేశము. ఆంధ్రదేశమునకు దక్షిణమెల్ల కాళహస్తి; పడమటిమెల్ల శ్రీశైలము; ఉత్తరపుటెల్ల ద్రాక్షారామము. ఇట్టి మహాక్షేత్రముల గలిగిన దేశమందు తానుద్భవింప లేదని, అప్పయ్య దీక్షితులవారు చాల వ్యసనపడియున్నారు. వారిట్లు ఆంధ్రభాష నభ్యసించి మాట్లాడునట్లు పుట్టకపోయితిమేయని దుఃఖించుటకుఁగారణంబు గలదు. ఆంధ్రదేశమందు పిల్లలకు మొదట లక్షరాభ్యాసము జేయునప్పుడే పంచాక్షర మంత్రము చెప్పఁబడుచున్నది. యజుర్వేదిగా తాము జన్మించనందున వారు వ్యసనపడుటకును కారణమున్నది. ఈ పంచాక్షరము యజుర్వేదమం దుండెడి శ్రీరుద్రమందున్నది. అందుచేత నే వారు దుఃఖించిరి. ఋక్సామవేదములమధ్య యజుర్వేదమున్నది. యజుర్వేదమునకు మధ్యభాగమగు నాల్గవ కాండమందు శ్రీరుద్రమున్నది. శ్రీరుద్రమునకు మధ్య పంచాక్షర మున్నది. పంచాక్షరముమధ్య ‘శివ’ యనెడి శబ్ద మున్నది.

పూర్వకాలమందు బ్రామియనియు, కరోష్ఠి అనియు ద్వివిధములగు యక్షరము లుండెడివి. బ్రామి యక్షరములు దినములపేరట వాడుకయం దుండక మఱగిపోయినవి. దానినే

బ్రహ్మలిపియనియుఁ జెప్పఁటగలదు. ఇప్పటికిని మన మేదేని అక్షరములు చదువుటకు వీలులేనంతటకు బ్రహ్మలిపి యని యందుము.

భాషల నక్షరమూలముగా మనము పొందియుండుట చేత నేమి ప్రయోజనము బొందెదము? మృగంబులకు భాషలేదు. పుస్తకములు లేవు. వానికి బళ్లు లేవు. మన కన్ననో యివియన్నియు గలవు. మృగంబుల కన్నను మన మేమి యధికసౌఖ్యము గలిగియున్నాము? మృగంబులకు వ్యసనములేదు. వంశము వృద్ధియగుచున్నది. ఆహారమన్ననో ఈశ్వరుఁ డొసఁగుచున్నాఁడు. రోగములులేవు. కష్టములు లేవు. రేపటి జీవనమున కేమిచేయఁబోవుద మనెడి చింత లేదు. పైనుదాహరించిన సాధనంబు లేదేశమందు లేవో యచ్చోట న్యాయస్థానంబులు లేవు. అనేక విధములుగా చట్టములు యేర్పడి యుండలేదు. పాప మధికమగుట లేదు. నాగరికత బలిసినదేశములందే యివి యధికములు. నాగరికత, బుద్ధి తైక్ష్ణ్యమును ఎక్కువగానుండు ప్రదేశములందు పాపమును, దుఃఖమును అధిక మగుచున్నది. విచిత్రమగు పాపంబులు చేయఁబడుచున్నవి. మనకు బుద్ధి ఉన్నది. ఐశ్వర్య మున్నదని యొక పాపము చేయుదమని యాశ కలిగినప్పుడే, యాబుద్ధియు, ఐశ్వర్యమును ఆ పాపంబును చేయుటయం దుపయోగింపఁ బడుచున్నవి. బుద్ధి, భాష, బళ్లు, ముద్రాలయములు మొదలగునవిగల మనము, పాపము, దుఃఖము, మొదలైన ప్రయోజనములనే పొందు

చున్నాము. అందుచే నివి ఈశ్వరుని యనుగ్రహమా? లేక దండనయా? యని యాలోచింపవలసి యున్నది. మనుష్య జన్మము మహోత్కృష్టమైనదని పెద్దలు చెప్పెదరు. ప్రత్యక్షానుభవమునఁ జూడఁగా దానికి ప్రత్యక్ష విరోధముగా నున్నది. ఈశ్వరుఁడు మనుష్యుల నందఱను మృగములుగా సృష్టించి యుండినయెడల చిత్రగుప్తునికి పనియే యుండదు. అనేక సాధనముల బొందిన మన మేల అట్లుండవలయును? ఇప్పుడు మన మొక తీర్మానమునకు రావలయును గదా? మృగజాతియందు కష్టమే లేదని చెప్పుటకు సాధ్యము లేదు. మనుష్యుల కుండెడి కష్టము లీమృగంబులకు లేకపోయినను, వానికి ఇతరవిధకష్టములు గలవు. పులి, చిన్నప్రాణుల జంపును. మార్జాలము, మూషికములను ధ్వంసము చేయును. మృగసృష్టియందును ద్వేష మధికముగా నున్నది. కాఁబట్టి యెప్పటికిని ప్రాణభయమున్నది. భయములేకయే చేసికొనుటకు మృగములవల్ల సాధ్యముకాదు. అందులకై బుద్ధి యావశ్యకము. బుద్ధినిమంచియందును, చెడ్డకార్యములందును ఉపయోగింపవచ్చును. మనుష్యజన్మమో, మృగజన్మమో కలుగకుండ బుద్ధిని ఉపయోగించువారు కోటిలో ఒక్కరే. అన్నదాన మొనర్చువారు, 'భోజనమునకై వచ్చెడి యనేకులలో ఒక్కసాధువు వచ్చునేమో, వారి కుక్షిలో ఒక పిడికెఁడు ఆహారము పోయిన మనజన్మ కృతార్థత జెందును గదా!' యని తలఁచి, విశేషముగ నన్నదానము చేసెదరు. అది తెలియనివారు సోమరివారల కన్నము పెట్టునట్లు

దూషించెదరు. బుద్ధిని సద్విషయమం దుపయోగపఱచి, కోటి జనులలో ఒకరు మాత్రమే క్షేమము బొందుదురు. పిదప నీ యల్పసంఖ్యాకులే, యితర జనుల కందఱికి దారి చూపుదురు. మాట, భాష, వీనిని ఉపయోగపఱచి, మఱల జన్మము లేకయే చేసికొనుట బహుసులభకార్యము. బుద్ధిని సరియైనదారిలో నుపయోగించిన యెడల మఱల జన్మము లేక చేసికొనవచ్చును. అందులకు శాంత మవశ్యము. శాంతము గ్రామములందు సులభముగా సాధింప వచ్చును. అయితే జనులందఱు నగరమందలి నాగరికముగు కాఁపురంబులు సేయుటకై వచ్చెదరు. శాంతము నందుటకు రాగద్వేషములను విడువవలయును. ఆశ దుఃఖమునకు కారణము. అన్నిటిని భగవదర్పణ చేసినయెడల ద్వేషభావంబు లన్నియు తొలఁగిపోవును. అప్పుడు జన్మరాహిత్యము గలిగి పరమేశ్వరుని బొందవచ్చును.

## * —: శివపూజా విశేషము :—

ప్రపంచమున వేదశాస్త్ర సమ్మతములైన యాలయములు రెండువిధములైయున్నవి. అం దొకటి శైవాలయము. రెండవది వైష్ణవాలయము. ఇతర ఆలయములు తక్కువ. దక్షిణదేశమున పిడారియార్ కోవిల్ (భట్టారికాలయము) అనఁబడునవి కొన్ని కనఁబడుచున్నవి. ఈ 'భట్టారికా'

---

* శివపూజావిశేషము, మోక్షసాధనము, అను రెండు విషయము లను శ్రీవారనుగ్రహించు కాలమున బ్ర॥ శ్రీ॥ విద్వాన్, సింగరాజు, రామలింగశాస్త్రిగారు సంగ్రహించిరి. వారియనుమతమున వానినిందుఁ జేర్చితిని.

శబ్దము లలితా సహస్రనామమునను దెలుపఁబడియున్నది. తామ్రశాసనములయందును కొన్ని చోటులందు పిడారి మాన్యమని సూచింపఁబడియున్నది. దేవాలయములు రెండు విధములైనట్లే మతములు మనలో రెండైయున్నవి. అందు పూర్ణమైనవి, వీరశైవము, వీరవైష్ణవము. వీరశైవము బళ్లారి ప్రాంతమున అధికముగఁ గలదు. రామానుజసంప్రదాయము వీరవైష్ణవము. [ఈ రెండు తెగలలోఁ జేరనివారు స్మార్తులు.] [ఇందు వర్ణభేదము లేక యందఱును బేర్కొనఁగుదురు.] వీరిలో చిహ్నముల భేదమున్నను భక్తిలో భేదము లేదు. రామానుజ మతమున భగవంతుఁడొక్కఁడేయనియు, పేరులన్నియు దేవతా భేదములనియు, అనఁబడుచున్నవి. పరమాత్మయొక్కఁడే, అతఁడే విష్ణువనుట. అట్లే వీరశైవుల మతమునను శివుఁడే పరమాత్మయను భావముకలదు. ఈ రెండు తెగలవారును మధ్యస్థుల నెగతాళి చేయుచుండుట సహజము. [స్మార్తులనఁగా శైవులైనను విష్ణుపరమైన పేర్ల నుంచుకొనువారు. వైష్ణవులైనను శివాలయములకుఁ బోవువారు.] ఇట్టి మతములబోధించు గురువులు ద్వేషబుద్ధినొందకుండిన మంచిదగును. కొందఱు జీవాత్మ స్త్రీ యనియు, పరమాత్మ పురుషుఁడనియు, తెల్పుచున్నారు. స్త్రీలు ఇతర పురుషుల చూడఁదగనట్లు కొందఱాచార్యులు ఇతర దైవముల చూడ రాదందురు. వీరి మొదటి యాక్షేపము పరమాత్మ యొక్కఁడే యనుట. వస్తు వొకటియైనపు డద్వైత మగుచున్నది. రెండు నైతైన యెడల వారి మతము సరియైనది. కాని వేషములు వేఱనియు వస్తు

వొక్కటనియు, చెప్పిన నది సరికాదు. ఒకేవస్తువు భేదమైన రూపముల ధరించినపుడు లోపమెక్కడిది? కొందఱు పూర్వా చారమును పాటింతురుకాని కారణము తెలియఁగరు. మన శాస్త్రములలో పరమాత్మయొక్కఁడే సృష్టి, స్థితి, సంహార ములకు కర్తయని తెలుపఁబడియున్నది. సర్వశక్తి పరమేశ్వ రునకే యున్నది. నాశన మక్రమ కార్యమని కొందఱి యభి ప్రాయము. అట్లుచూచిన సృష్టియే యక్రమకార్యము. ఎవరును చచ్చుట లేదని తలంచిన మన సంతతివారే మనలఁ జంపుదురు. కావున నాశ మావశ్యకము. లేని యెడల ప్రపంచమునకు కష్టముకలుగును. ఒక్కొక్క కార్యమున కొక్కొకగుణము ప్రధానమైయున్నది. సత్వరజస్తమో గుణ ములలో బిడ్డల రక్షణమున సత్వరజోగుణములును కష్టముల నివారించుటలో తమోగుణమును ప్రధానమైనది. కార్యము ననుసరించి గుణ ముండును. సృష్టియందు రజోగుణము, రక్షణమున సత్త్వము, నాశమున తమోగుణము. ఈ మూఁడుగుణములకును మాయ యనిపేరు. కార్యము కలిగి నపుడు గుణముల తోడనుండును. లేనిగుణములను పర మాత్మ తనకుఁ దెచ్చికొనుటచేతనే దీనికి మాయయనుపేరు కలిగెను. 'యా మా సా మాయ' యని చెప్పఁబడినది. మాయ త్రిగుణాత్మిక. లేనిదియున్నట్లు చూపునది మాయ. బ్రహ్మ రజోగుణమునను, విష్ణువు సత్త్వగుణమునను రుద్రుఁడు తమోగుణమునను ఉందురు.

వైష్ణవ సంప్రదాయములు పదిపదునైదు కలవు. శైవ సంప్రదాయములు రెండు మాత్రమే కలవు. లోకమున సంప్రదాయ మొకటిగ నున్నపుడే దేవాలయములు కట్టఁబడినవి. పూర్వమన్నిచోట్లను విభూతిధారులే దేవాలయములందుఁ బూజారులుగ నుండిరి. అర్చకులు శ్రీరంగము మున్నగు క్షేత్రములందు కాణియాళాల్, అని యుండిరి.

[ పూర్వము శివాలయములందు రెండువిధము లుండినవి. విభూతినిధరించు శివసంప్రదాయము, గోపీచందనధారణచేయు భాగవత సంప్రదాయము అని వైష్ణవమున సంప్రదాయము లనేకము లయ్యును ఆలయములు తక్కువ. వైష్ణవాలయ పాలన శైవులదే యైయుండెను. ధర్మకార్యములు చాల వఱకు శైవులదే యైయుండెను. ]

పరమాత్మకు కార్యము లనేకములు. ఈ విషయము దెలుపునవికొన్ని. 'పంచకృత్య పరాయణాయనియు, సృష్టిస్థిత్యంతకరిణీ తిరోధానకరీశ్వరీ, సదాశివానుగ్రహాదా పంచకృత్యపరాయణా యనియు, పంచప్రేతాసనాసీనా యనుటలో అయిదును పరమాత్మలోనణఁగుట. అట్లు అణఁగఁగా అవి పరాశక్తిలో అణఁగును. అపుడు దేవి యాధారమగుచున్నది. త్రిగుణములలో నేది ముఖ్యము. 'సత్త్వం రజ స్తమ ఇతి ప్రకృతే గుణాఖ్యా శ్రేయాంసితత్ర కిల సత్త్వగుణో నృణాంసి.'

శివపూజా న్యాయమున నిట్లు తమోగుణునిఁ బూజింపనగునా? యను శంక అద్వైతులలోనే కొందఱకు కలదు.

ఉపాసన యనుట ప్రేమించుటయే. ఫలము నుద్దేశించి ప్రేమించుట యన సమయము నెఱుఁగుట. ఇది వాస్తవము కాదు. కార్యము నుద్దేశించుట కాదు. శ్రేయస్సుకై దేవుని పూజించుట కాదు. ఒక మూర్తియే త్రిగుణి. ఒకఁడే యనుటలో నిర్గుణి యనియే పరమాత్మను జెప్పవలెను. అనఁగా తురీయము. త్రిగుణాతీతము తురీయము, 'పరమాత్మ, శివం, శాంతం, శివం. అద్వైతం తురీయం, అదే లింగాకారము. రూపకల్పనచే నామభేదమేర్పడును. శివుఁడు మహాలింగమూర్తి. శివునకు విష్ణువునకు భార్యలు వేఱు 'శివమద్వైతం చతుర్థం మన్యంతే' తురీయము శివునకు రుద్రాంశమే స్వరూపము. బ్రహ్మ విష్ణు చిహ్నములు కావు. మనము మేల్కొనుచు నిద్రించుచు కల గనుచున్నాము. ఈమూఁడుస్థితులును కష్టమే. ఈ మూఁడు విధములవలెనే జగచ్ఛరీరునకు 'జడం, జీవం, చిత్' అచిత్ అని స్వరూపములు. అతనికి కావలయునని మూఁడవస్థలు వచ్చును. పరమాత్మ జగత్కార్యమునకై యిట్టి గుణములను అవస్థలను ధరించును పరిపాలన జాగ్రదవస్థ, సుషుప్తి సంహారావస్థ సకలేంద్రియ శక్తియను గుణసుషుప్తి. 'విశ్వ తేజసప్రాజ్ఞాః' (ఉపనిషత్) అని యున్నది. మూఁడవస్థల యందును మేల్కొని యుండుటయే యని భావము. వనచరులకు సహితము జాగ్రదవస్థ కష్టమే. సుషుప్తిలో కష్టము లేదు. సుఖమే. అయిన నట్లేయుండుటకు వీలు లేదు. కావున నీ మూఁటిని మించినదే మంచిది. నాల్గవస్థానము చేరినపుడు సుఖము కలదు. ఈ యవస్థకే ముక్తి, మోక్షమను పేరులుగలవు. మోక్షావ

స్థను జెందిననే యానందము. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి' 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్, అని యున్నది. పురాణము లు వినుట, తీర్థస్నానములుచేయుట, మనశ్శుద్ధి కే. పుణ్యకార్య ములలో వేదాంతశ్రవణము గొప్పది.'కృచ్ఛ్రాశీతి ఫలంలభేత్ వేదాంత శ్రవణాత్' అనియున్నది. అందుచేతనే మహాత్ములు నిష్ఠయం దుందురు. అదియే శివస్వరూపము. దానికి చాల సమీపమున నున్నది యానందము. సుషుప్తిలో నున్న యానం దమే యాత్మనిష్ఠలోనున్నది. కావున తురీయమునకు సమీపము సుషుప్తి. నిద్రించకయే నిద్రించుట యనుట. పరమాత్మ రుద్రుఁడు. అతని రూపమే తురీయము. పరమోపాసన శివస్వ రూపము. నిత్యప్రళయము సుషుప్తి. సుషుప్తి మానవున కావ శ్యకము. తమోభేదనమే యానందము. మహాప్రళయ మను గ్రహ బుద్ధితోడనే జరుగుచున్నది. అందుచేతనే పరమశివునిఁ బూజించుట యావశ్యకము. నిద్ర మోక్షము యొక్క రూపమే. సంహారమన ఉపసంహారము. 'సంహరతే సర్వాణ్ కూర్మా నంగా నీతి సంహారః, తమస్సన చీఁకటియు మోక్షమున వెలుతురు ఆనందము అన్నియుఁ దెలియును. పరమాత్మయెడ భక్తియుండిన నెట్టి రూపమైనను పూజింపనగును. పరమశివుని రూపము దెల్పునది దేవీరూపము. దానిచేతనే యీశ్వరుని దెలిసికొనుట. సరస్వతి, లక్ష్మి, దుర్గ ఈ మూఁడు శక్తుల మిం చినది పరాశక్తి యని తెలిపియున్నారు.

---

## —: మోక్షసాధనము :—

మతసంబంధమైన విషయములకు శాస్త్రములు ముఖ్యములు. మనసు నిలుకడగ నుండుటకే దానాదికములు చేయుట. ఈ దేహమును వదలి మరుదేహమునకు బోవునపుడు (మఱల రాకుండు నపుడు) మన స్సేవిధమున నుండవలయు ననుటను దెల్పునది శాస్త్రము. శాస్త్రసారములును గొన్ని కలవు. అందు భగవద్గీత యొకటి. 'ప్రయాణకాలే మనసా చలేవ' అని భగవద్గీతయందున్నది. అంతమున మనసు నిలుకడగ లేకున్న మనముచేయు కార్యము లన్నియు నిష్ఫలములే. భోజచరిత్రలో 'మాంధాతాచ మహీపతిః కృతయుగా లంకార భూతోగతః సేతుర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాన్తకః। అన్యేచాపి యుధిష్ఠిరః ప్రభృతయో యాతా దివం భూపతే! నైకేనాపి సమం గతా వసుమతీ నూనం త్వయా యాస్యతి' యని యున్నది. జాగ్రదవస్థాంతమున నుండునదే స్వప్నావస్థలో నుండును. ఈ దేహమును వదలునపుడు మోక్షేచ్ఛ యుండుట మంచిది. గీతలో నీ విషయమే. 'అపి చేదసి సర్వేభ్యః పాపేభ్యః పాపకృత్తమః, క్షిప్ర జ్ఞానప్రదే నైవ, యని యున్నది. ఎంతపాపియైనను నంతమున మంచి చింతయున్న మంచిలోకము కలుగును. అట్టి స్థితి కిప్పటినుండియే ప్రయత్నింప వలయును. ఇట్టి విషయములే మన శాస్త్రములు బోధించుచున్నవి. ఈ విషయము సకలజను లంగీకరింపఁదగినదే. నరుఁ డెన్నివిషయములఁ జూచుచున్నను తన విషయమును మాత్రము వదలఁడు. 'మాలీ సకుంభ పరిరక్షణ

[illegible]

ధీర్నటీవ' యను విషయము దీనికి సరిపోయినది. కావుననే యిట్టి విషయము చిన్నప్పటి నుండి యుండవలయును. 'ఆ సుప్తేరా మృతేః కాలం నయే ద్వేదాన్త చిన్తయా' యని యున్నది కదా! దేవుని నొకచోట చెట్టుగా చెప్పియున్నారు. 'తస్మై శంకరపాదపాయ నమతే' అనునది. కావున పాదముల మాత్రమే దైవధ్యానమున ధ్యానింప వలయును. ఇతరాంగముల ధ్యాన మనవసరము. ఈ విషయమును బోధించుటకే శంకరావతారము కలిగెను. కావున మనము మృగములవలె కాక యుత్కృష్ట మరణము గోరవలెను. వీని కన్నిటికి ఆధారము మన మనస్సు ఒక్కటియే.

---

## —: వైదిక సమయము. :—

గుణములందు మంచి చెడుగులను మన మెట్లు పాటింతుమో అట్లే శుద్ధము, అశుద్ధము, ఎంగిలి, మైల, మడి, మున్నగు విషయములను గూడ ఆచారము లని వ్యవహరించుచు మనము పాటించుచున్నాము. ఈ యాచారము మనదేశమున నిపుడు కలిగినది కాదు. ఇది చాలదినములనుండియే సిద్ధించియున్నది. దీనికే స్మృతులయందు ఆచార కాండమని పేరు. దేవతలను బూజించుట, పితృకార్యములను నిర్వర్తించుట, అతిథిసత్కారము సేయుట మున్నగునవి యీ యాచారకాండకు సంబంధించిన వైదికసమయములని చెప్పఁబడినవి. ఈ వైదికసమయములను ముంచివేయుటకై అనేకమతములు దేశమునందు ప్రబలియుండెను. అట్టి

విషమసమయమున పరమకారుణికమూర్తి యగు శ్రీ పరమే
శ్వరుఁడు లోకానుగ్రహార్థము శ్రీశంకరభగవత్పాదుఁడై అవ
తరించెను. తన మతమును స్థాపించుటకు చాల శ్రమపడెను.
దుర్మతములనెల్ల రూపుమాపెను. శ్రీమదాదిశంకరులు ఆ
కాలమున సాధారణ మనుష్యుని వలెనే యుండిరి. అయినను
వారి పనులుమాత్రము అమానుషములై వెలసినవి. ఒక్క
మనుష్యమాత్రుఁడాయవతార రహస్యమును తెలిసి కొని
యాడుటకు సమర్థుఁడగునా? ఆ విషయ మటుండనిండు. పైఁ
జెప్పిన వైదిక సమయముల తత్త్వమును చక్కఁగ గుర్తె
ఱింగి, ఈశ్వరారాధనము చేయుట యెల్లరకును దుష్కర
మని తలంచి యిట్లు చెప్పియున్నారు. చూడుఁడు. ఈ యీశ్వ
రారాధనమునకు స్నాన మనవసరము. పుష్పము లక్కర
లేదు. నైవేద్యములు పనిలేదు. అయితే సర్వమును నీవే
యనెడి భావముమాత్రము కావలసియున్నది. వాత పిత్త
శ్లేష్మములతో గూడిన యీ శరీరము ఒకపు డున్నటుల మఱొ
కపు డుండుట అసంభవము. 'అయితే మేమెట్లు వైదికసమ
యము నెఱింగి యీశ్వరారాధనమును జేయుదుము' అని పలు
వురకు సంశయము కలుగవచ్చును. అందులకే శ్రీమదాచా
ర్యులవారు ఇట్టి సులభోపాయము ననుగ్రహించియున్నారు.
ఇటువంటి సులభమార్గమును అవలంబించి మీరును కృతార్థు
లగుదురు గాక! యని యాశించెదను.

## —: ఈశ్వరారాధనము :—

మన మొక పిల్లవానికి 'ఈశ్వరునియెడ భక్తియుంచుము. గురువులకు నమస్కరింపుము' అని చెప్పినయెడల వాఁడట్లుచేయుట మిక్కిలి అరుదుగనుండును. కాని, మన మట్లు చేసిచూపినపుడుమాత్రము వాఁడును అట్లే పడిపడి దండములు పెట్టుటకు ప్రారంభించును. చరితార్థమేమనఁగా? ఉపదేశమునకంటె ఆచరణమే సత్వర ఫలప్రద మనుట. కనుకనే అహంభావరహితమైన ఈశ్వరారాధనవిధిని శ్రీమదాచార్యులవారు స్వయముగ ననుష్ఠించి మన కీ శ్లోకముచే నద్దాని ననుగ్రహించిరి.

'ఆత్మా త్వం గిరిజామతిః పరిజనాః ప్రాణా
శ్శరీరంగృహం, పూజా తే విషయోప భోగరచ
నా నిద్రాసమాధిస్థితిః, సంచారః పదయోః
ప్రదక్షిణవిధి స్తోత్రాణి సర్వాగిరః, యద్యత్క
ర్మ కరోమి తత్త దఖిలం శంభో తవా రాధనం.'

హే! శంభో నీవే నాయందాత్మ స్వరూపుఁడవై యున్నావు. నాయందలి నిత్యానిత్యవివేచనశక్తియే నీ యర్థాంగి యగు పార్వతీస్వరూప మయియున్నది. నాశరీరమే నీయాలయము. లోకవిషయములందు నేను రోసియుండుటయే నీ పూజ. నానిద్రయే ఆత్మానుసంధానము. నేనుచేయు సంచారమే నీకుప్రదక్షిణించుట. నే నాడు మాటలే నీస్తోత్రపాఠములు. అది యిది యననేల? నే నేపనిచేసినను, అదియం

తయు నీపూజనమే కాని, మఱొకటికాదు. అని పైశ్లోకము నకు భావము. ఇట్టి భావము మానవుని మనసున స్థిరముగ నాటుకొనినపుడు వానికి స్నానపానములతో నవసరము లేదు. వానికి వైదికసమయ మనవసరము. మనుష్యున కిటువంటి సుఖము అనుభవ సిద్ధమైనపుడు రాజ్యముతో పనియుం డదు. ధనకనకవస్తువాహనములతోడను పనియుండదు. ఇట్టి ఆత్మానందము ననుగ్రహించినవారే ఆచార్యు లనఁబడు చున్నారు. కావుననే, మన యాచార్యులయందు మనభక్తి సుస్థిరమై యుండవలయును. శ్రీమదాచార్యులవారు పైశ్లో కము ననుసరించి మఱొక శ్లోకమును సౌందర్యలహరి యను గ్రంథమున చెప్పియున్నారు, చూడుఁడు.

'జపోజల్ప శ్శిల్పం సకల మపి ముద్రా విరచనా !
గతిః ప్రాదక్షిణ్యక్రమణ మశనా ద్యాహుతివిధిః
ప్రణామ స్సంవేశ స్సుఖమఖిల మాత్మార్పణ దృశా !
సపర్యాపర్యాయ స్తవ భవతు యన్మే విలసితమ్॥'

మానవున కిటువంటి అద్వితీయ భావమునందలి యా నందముకలిగినపుడు దానినెవఁడు వర్ణింపఁగలఁడు ? అది అను భవముచేతనే తెలియఁదగియున్నది. ఎటువంటివారును ఆయా నందము ననుభవించిన పిదప లోకవిషయములవైపు కన్నెత్తి యైన చూడ నొల్లరు. మీరెల్లరును అటువంటి సులభో పాయమునందు మనసు నిలిపి ఈశ్వరారాధనవిధిని సాగింతురు గాక.

---

—: కాళిదాసుఁడు—వాక్సిద్ధి :—

మనము మంచివాక్కును (వక్తృత్వమును) పొందవలయుననిన దేవ్యనుగ్రహమును సంపాదింపవలయును. పాశ్చాత్యదేశములందు సయితము వాక్సిద్ధిని బొందినవారెవరని ప్రశ్నించునపుడు షేక్స్పియరు మున్నగు వారని ప్రత్యుత్తరము వచ్చును. అట్లే దాదాపుగ రెండుమూఁడు వేల యేండ్లనుండి వాక్సిద్ధిని బొందిన కవి మన దేశపు వాఁడెవఁడన్న మహాకవి కాళిదాసనియే చెప్పవలసియున్నది. ఇతని కాలదేశములను గుఱించి మనకు విశదీకరించి నిజమును చెప్పవారెవ్వరును లేరు. ఇతఁడు మహాకవి యని జాతి మతభేదములు లేక ప్రపంచమంతయు అంగీకరించుచునే యున్నది. ఈ మహాకవి బాలహితార్థియై పెక్కు కావ్యములను రచియించెను. వానియందు సులభతరమైనది రఘువంశ మనెడి కావ్యము. సంస్కృతమును అభ్యసింపఁగోరు బాలురకు తొలుత ఈ కావ్యమునే పాఠము చెప్పుదురు. రఘువంశమున పుట్టినందుననే శ్రీరామునకు రాఘవుఁడన్న పేరు కలిగినది. మహాకవియగు కాళిదాసుఁ డాకావ్యము తొలుత నిట్లు వ్రాసియున్నాఁడు.

'వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగత:పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.'

వాక్కునకును, దాని యర్థమునకును ఎట్లు అవినాభావసంబంధము కలదో, అట్లే అవినాభావ సంబంధముతో నుండు (అనఁగా అర్థనారీశ్వరస్వరూపముతో నుండు) జగత్పి

తరులను వాగర్థసిద్ధికొఱకు నమస్కరించుచున్నాను. అని చెప్పియున్నాఁడు. ఇందువలన వాక్కు అంబాస్వరూపమనియు, అర్థము పరమేశ్వర స్వరూపమనియు మనకు తేలినది. నాఁటి నుండి నేఁటివఱకు ఈ లోకమున ఎందఱు కవు లుద్భవించినను, ఎన్ని గ్రంథము లుప్పతిల్లినను, వాగర్థప్రతిపత్తిగల కవులకును, గ్రంథములకును మాత్రమే ప్రచారము మెండుగా నున్నది. అచ్చుకూటములు మొదలగు సౌకర్యములు లేని యా కాలము నాఁటి గ్రంథములు అంతరించిపోక మన కాలమువఱకు ప్రచారమునం దుండుట కా గ్రంథము లందలి వాగర్థప్రతిపత్తియే ముఖ్యకారణములు. కానిచో, అవి ఏతన్మధ్యకాలమునఁ గల్గిన విప్లవములందు నశించియే యుండును. కాళిదాసుని పేరునుబట్టియే మన మతఁడు దేవీభక్తుఁడని తెలిసికొనవచ్చును. మన ఆచార్యులగు ఆదిశంకరులును, ఈ విషయమును సౌందర్యలహరి యను గ్రంథమున పేర్కొని యున్నారు. ఈ కాలపువారి గ్రంథములకువలె వీరి గ్రంథములకు, పండితాభిప్రాయములును, బొమ్మలు చేర్చుటయు, ఊరూరు తిరిగి ప్రచారము చేయుటయును, అనవసరములు. గుణముగల గ్రంథములను బుద్ధిమంతులు తమంతట తామే వచ్చి తీసికొని వానియందలి రసము ననుభవింతురనుట కింతకంటె మనకు వేఱు దృష్టాంత మేల? కావున, లోకోత్తరమగు వాగర్థప్రతిపత్తికై మానవునకు దేవ్యారాధనము తప్ప వేఱొండు మార్గము లేదని మన పూర్వాచార్యులవలన మనము తెలిసికొనవలయును.

---

## —: కుశావతీ వృత్తాంతము :—

శ్రీరాముని పుత్రుఁడగు కుశుఁడు కారణాంతరముచే అయోధ్యను వదలి తనపేర కుశావతి యనునొక పట్టణమును నిర్మింపించి, అందుండి రాజ్యపరిపాలనాదికము నెఱవేర్చుచుండెను. ఒక నాఁడతఁడు తన కేళీగృహమున పరుండఁ బోవునపు డొక్క యువతీమణి యాతని ప్రక్క నిలుచుండి నటులఁ దోఁచెను. రాజు దిగ్భ్రమము నొంది నలువైపులఁజూచెను. ఆమెతప్ప మఱెవ్వరు నేప్రక్కయును కాన్పించ లేదు. ఒక్క యాఁడుదానిని చూచినంతనే రాజగు వాఁడిట్లల భయపడవలయునని మనకు సంశయ ముదయింపవచ్చును. అదురుగుండెయు పిరికి కండయు లేని బిరుదమగఁడు, అతఁడా స్త్రీని జూచి భయపడెనా? కాదు. రఘువంశపు రాజులు పర స్త్రీలను మనస్సునందుకూడ తలపోయువారు కారు. వారు పాపమునకు భయపడినట్లు మఱే విషయమునకును భయపడరు. కావున ఏకాంతగృహమున ప్రత్యక్షముగ నగపడుచుండిన పరస్త్రీని జూచి యాఁత డులికిపడి చిట్టచివర కిట్లడిగెను.

'కాత్వంశుభే! కస్యపరిగ్రహోవా?
కింవా? మదభ్యాగమ కారణం...తే,
ఆచక్ష్వ మత్వా వశినాం రఘూణాం,
మనః పరస్త్రీ విముఖప్రవృత్తిః.'

(రఘు॥ 16. వ. సర్గ. 8. వ. శ్లో.)

ఓ కల్యాణీ! నీ వెవ్వతెవు? నీభర్త యెవ్వఁడు? నీవు నా యొద్ద కేలవచ్చితివి? రఘువంశపు రాజులు పరస్త్రీల ముఖమును సయితము చూచువారు కారు సుమా! అన్నాఁడు రాజు, పాపము! చూడుఁడు! ఆమనః పారిశుద్ధ్యము. ఆమె యెవ్వతె యను కొంటిరి? అయోధ్యానగరాధిదేవతయగు పరాశక్తి. మన భారతభూమియందు గ్రామదేవతలేని యూరే యుండదని మీరు తెలిసికొనియే యున్నారు. ఆమెకు రాజు కుశావతియందు నివసించుట యిష్టములేని పని. కావున నాచే రక్షింపఁబడుచుండు అయోధ్యను వదలి నీవేల యిచట నున్నా వని రాజును ప్రశ్నించినది? అద్భుతములగు మరకత ఇంద్ర నీలాది రత్నములచే నిర్మింపఁబడిన అంతఃపురములును, భవనములును, చిత్రవిచిత్రములగు ప్రతిమలతోఁగూడిన కుట్టిమకుడ్యములును నీవు లేకపోవుటవలన పాడుపడిపోవుచున్నవి. తాతముత్తాతల కాలమునుండి రాజధానియై వెలసి, నాచే సంరక్షింపబడుచున్న అయోధ్యను వదలిపెట్టకుము. అని చెప్పెనఁట. ఈ సంభాషణవలన మన మెన్నియో విషయము లను గ్రహింపవలసి యున్నాము. ఇవి సామాన్యములా? మహాకవి వాక్యములు. ఈ సందర్భమున అయోధ్యా పట్టణ నందలి రాజభవనమున ఒక్కచో రచియింపఁబడిన చిత్రము ను గుఱించి కవి యిట్లు వర్ణించి తన వాగర్థప్రతిపత్తి నెట్లు వెలయించెనో చూడుఁడు!

'చిత్రద్విపాః పద్మవ నావతీర్ణాః
కరేణుభి ర్దత్త మృణాళభంగాః

సఖాంకుశాఘాత విభిన్న కుంభాః
సంరబ్ధ సింహ ప్రహృతం వహన్తి.'

(రఘు॥ 16-వ సర్గ. శ్లో. 16)

ఇటువంటిదే గదా కవిత్వము! అన్నియు కవిత్వములగునా! ఈ వాక్కు అతని కెచటనుండి వచ్చినది? అంతయు, అంబా కటాక్షమున సిద్ధించినదే! లేకుండిన ఊరక కలిగినదా యింతటి ప్రతిభ? వే యేటికి? ఈ విషయ మటుండనిండు. మానవుఁడు ముక్తుఁడు కావలయు నన్న రెండేమార్గములు. భగవంతునియెడ భక్తిచేయుట. ఆశ వీడుట. దేవుని యందు భక్తిలేక మానవుఁ డెట్టిఫలము నెదురుచూచినను ప్రయోజనము లేదు.

---

## —: మోక్ష మెట్లు కలుగును ? :—

మనుష్యుఁడు కోరఁదగినది మోక్షము. ఆమోక్ష మను నది ఆశ వదలిననే కాని సిద్ధింపదు. మానవుఁడీయాశ నెప్పటికిని వదలుటలేదు. మోక్ష మెట్లు లభించునని ప్రశ్న వచ్చినపుడు మన ఆచార్యులవా రిట్లు చెప్పిరి. చూడుఁడు. మానవుఁడు వేనిని కావలయునని సదా తలంచుచుండునో వాని నన్నిటిని 'వలదు వలదు' అని తలంచుటయే మోక్షము. అని సెలవిచ్చిరి. మానవుఁడు భక్తిపరుడయిననే కాని యీ యుపాయము నవలంబింప నేరఁడు. ఎన్నటికి నయిన ఈయుపాయము నవలంబింపకయే మనుష్యుఁడు మోక్షమును బొందుటలేదు. కాఁబట్టి మా

నవుఁడు నిత్యతృప్తుఁడయి గతాగతములకు వగవక పరమేశ్వ
రునియందు భక్తిచేసి చరితార్థుఁడు కావలసియున్నాఁడని మన
కు తేలినది. ఈ రెండుద్దేశములును నిరంతరము నెరవేరుచుం
డవలయుననియే పూర్వులగు ఆచార్యులు మా కాజ్ఞాపించిరి.
వారును మేమును ఆదిశంకరుల ఆదేశము నే శిరసావహించి
మీకందఱకును చెప్పుచున్నాము. నే నెన్నిచెప్పినను శ్రీవారి
గ్రంథములలోని యభిప్రాయములే యన్నియు నని మీరు
తలంపవచ్చును. వారి తర్వాతివారయిన మేము తదాజ్ఞను
గొని యింటింట తిరిగి బోధించుట దుష్కరమని మిమ్మెల్లర
నొక్కచో గుమిగూర్చి శ్రీవారి యాదేశముల నెఱింగించు
చున్నాము. రాజాజ్ఞ నెఱింగించుటకు తలారి యెట్లు తుడుము
మ్రోగించి జనులను పోగుచేసికొనునో, అట్లే మేమును, ఈ
యేనుఁగులు గుఱ్ఱములు ఒంటెలు మున్నగువానితో బయలు
దేరి, యూరూరు సంచరించుచు లోకమునకు శ్రీవారి యా
దేశమును తెలియఁజేయు చున్నాము. ఇంతకన్నను మాకు
ముఖ్యమగు పని మఱియొకటిలేదు. మీర లెల్లరును వ్యయ
ప్రయాసములకు లోనయి, యింతవఱకు కాచియుండి యీ
యుపన్యాసమును వినినందులకు నాకుచాల సంతసమగుచున్న
ది. ఈ యుపన్యాసము మీ కెంతవఱకు లాభకారి కాఁగలదో
కాని, మీవలన నేనింతతడవు సత్ప్రసంగమున ప్రొద్దుపుచ్చి
తిని. ఇది నాకు అత్యంతలాభకారి యనుటకు నాకెట్టి సంశ
యమును లేదు. మీర లెల్లరును శ్రీమదాదిశంకరులవారి యా
దేశము నెఱింగి పరమార్థమును బొందుదురు గాక! యని



శ్రీవారు దీక్షావిసర్జనానంతరము ప్రేక్షకులకు
పుష్కరిణియందు దర్శనమొసంగుట.

మఱొకమాటు హెచ్చరించుచున్నాను. అని శ్రీవారు సౌంద ర్యలహరి నుండియు, ప్రబోధసుధాకరము నుండియు రెండు చక్కని శ్లోకముల నుడివి వానిభావము నుపన్యసించి విర మించిరి.

---

## * —: అర్థశాస్త్ర విచారము :—

వేదములు 4; అంగములు 6; ఉపాంగములు 4; ఉపవేదములు 4; కాఁగా మొత్తము 18 విద్యాస్థానము లగును. ఆయుర్వేదము, అర్థశాస్త్రము, గాంధర్వవిద్య, ధను ర్వేద మని నాలు గుపవేదములు కలవు. ఆయుర్వేద మనునది దేహము దీర్ఘకాలము మంచి యారోగ్యమును బొందుటకు దారి చెప్పునది. మానవుఁడు రోగములేక దీర్ఘకాల ముండిన యెడల శాంతింబొంది మఱల జన్మమేర్పడకయే యుండు టకు ప్రయత్నము చేయనగును.

అర్థశాస్త్ర మనునది యొక ఉపవేదము. ధర్మార్థ కామమోక్షము లని పురుషార్థములు చతుర్విధములు. మనము వేదోక్తములగు సత్కార్యములు చేయుచున్నాము. వానిని చేయుటచేత ప్రత్యక్షముగా ఎప్పటికప్పుడే ఫలముకాన్పించుట లేదు. కాని మనకు క్షేమమును గలుగ జేయును. అదృష్ట మను పదమునకు మనకంటికి తెలియనిది యని అర్థము. అట్టి యదృష్టమగు ఫలము నొసంగెడి పురుషార్థమునకు ధర్మమని

---

* ఈ యుపన్యాసమును శ్రీ. కం. జగన్నాథంగారు (బి. ఏ) వ్రాసిరి. వారియనుమతమున నిది యిందుఁ బొందుపఱుపఁబడినది.

పేరు. ప్రత్యక్షమగు ఫలమునొసఁగెడిదానికన్నను ధర్మమనెడి పురుషార్థము చాల శ్రేష్ఠమైనది.

అర్థమను పురుషార్థము దృష్టమగు ప్రత్యక్షఫలమునొసంగును. ధర్మమనునది వేదాంగములలో చేరినది. అర్థము ఉపవేదములలో నెన్నఁదగినది. నాలుగుపవేదములును ప్రత్యక్షమగు ఫలములను గుఱించియే చర్చించును. గృహధాన్యాదిఫలముల నొసఁగునది అర్థము. తత్కాలమందు సుఖముగా నుండవలయునని కోరుట కామము. అన్నివేళలందును పూర్ణమగు ఆనందము నొసంగునది మోక్షము.

ఆయుర్వేదము శరీరక్షేమమునకు కావలసిన సాధనము. అర్థశాస్త్రమును అట్టిదే. ఆహారము, నిద్ర, శరీరమున కుపద్రవ మేర్పడకుండుట, మొదలగు విషయములను అర్థశాస్త్రము చెప్పుచున్నది. మనకుండెడి క్షుద్బాధకు ముఖ్యముగా ఆహార మావశ్యకము. ఎండ, వాన, గాలి వీనినుండి కాపాడు కొనుటకు మనశరీరమునకు వస్త్ర మావశ్యకము. నిలచియుండుటకు గృహము కావలయును. ఇతరులు మనలను హింసింపక యుండవలయును. ఇట్టి యవశ్యములగు వానిని మన కొసంగుటకే రాజ్యాంగ మేర్పడియున్నది. మన యాహారమును ఇంకొకఁ డపహరింప కుండునట్లు రాజు రక్షింపవలయును.

ఈ కాలమం దనేక రాజ్యాంగము లేర్పడియున్నవి. ప్రజలయొక్క రాజ్యాంగములు కొన్నికలవు. చక్రవర్తుల రాజ్యాంగములు కొన్నికలవు. పైకనుబఱచిన నాలుగు ముఖ్య

విషయములనుండి ప్రజలనురక్షించి యిచ్చుటయే యన్ని రాజ్యాంగముల కార్యము. ఇట్టికార్యములను చేయుటకు రాజ్యాంగము చట్టముల నేర్పఱచికొనవలయును. తన్ను తాను రక్షించుకొనవలయును; పిదప పేదలను ధనికులను నిష్పక్షపాతముగా రక్షించుటకును, దుర్బలమగు ప్రజలను మరికొంత యెక్కుడుగా కాపాడుటకును: రాజ్యాంగమున కొన్ని యేర్పాట్లను చేయవలయును. ఇట్టి యేర్పాట్లనే మన అర్థశాస్త్రము చెప్పుచున్నది. ఇదిగాక రాజ్యాంగమునకును, ప్రజలకును ఇతరదేశీయ రాజ్యాంగములవలన వచ్చెడి అపాయంబుల నడ్డగించుటకు కావలసిన యుపాయములను కూడ అర్థశాస్త్రము చెప్పుచున్నది.

---

## —: చతుర్విధోపాయములు :—

శత్రువులను జయించుటకు నాలుగుపాయములుకలవు. అవి సామ, దాన, భేద, దండములు. వానిలో మొదటనే దండోపాయంబు నుపయోగింపరాదు. మన కేకార్యము కావలసియున్నను దానిని చతుర్విధోపాయములతో సాధింపవలయును.

సామము:—మన మనస్సును శాంతముగా నుంచికొని, యెదిరిపై పరమప్రేమనుంచి మంచిగా మనకు కావలసినదానిని సాధించుకొనుట.

దానము:—పై యుపాయముచేత సాధింపలేకపోతిమేని యెదిరికి కావలసిన వస్తువేదేని నొసంగి మన కార్యమును సాధించుకొనుట.

భేదము :—పై రెండుపాయములచేత సాధింపలేక పోతిమేని యెదిరికిని వానియిష్టులగువారికిని విరోధమును కల్గించి తద్వారా వానిని బలహీనునిగాచేసి మన కార్యమును సాధించుకొనుట.

దండము :—సామ, దాన, భేదములచే మనకార్యము ఫలింపకపోయినట్లయిన కట్టకడపట దండోపాయము నుపయోగింపవలయు. అప్పుడు ధనుశ్శాస్త్రరీతిగా ఎదిరిని దండించి మన కార్యమును సాధింపవలయును. శత్రువులను జయించుట కివియే మార్గములు.

ప్రజలలో దుష్టులే శత్రువులు. దుష్టులవలనగాని, వారి కూటములో చేరినవారి వలనఁగాని, యితరప్రజలకు, కష్ట మేర్పడకుండ చూచుకొనవలయును. ఇందులకై రెండు పాయములు గలవు. ఒకఁడు దుర్యోజనతో ఇతరులకు చెఱుపుచేయుటకు ప్రయత్నించుచున్నాఁడు. ఇతరులకు చెఱుపుచేయుటచే తనకుఁగల అనుకూలము కన్నను, ప్రతికూలమే యెక్కుడని ఆ దుర్మార్గునికి బాగుగా స్ఫురింప చేయుట యొకటి. ఎవఁడేని పదిరూపాయల నోటు దొంగలింప వచ్చినపుడు వానిజూచి 'ఓరీ, యీ పదిరూపాయలవలన నీకు కల్గెడిఫలముకంటె, వెనుకవచ్చు కష్ట మెక్కువరా' యని చెప్పి వానికి భయమును కల్గింపవలెను. ఇదిగాక యట్లు మునుపు చేసినవారి నెవ్విధముగా దండించిరో ఆ విధమును నిదర్శనముగా వానికి చూపుట మఱొకటి.

దుష్టునికి పాపకృత్యముల జేయవలయుననెడి యభి

ప్రాయములను మొదలే కలుగనీయకచేయుట అన్నిటికన్ననుత్తమము. ఇందుకు ధర్మశాస్త్రముయొక్క సహాయ మావశ్యకము. కామక్రోధములవలన కలుగు ఫలములను గుఱించి ధర్మశాస్త్రము చెప్పుచున్నది. కామక్రోధములకు వశపడుట చేత కష్టములే రాఁగలవని దుష్టులకు తెలియునటుల బోధింపవలయును. సాధారణముగా 100-కి 99 జనులు మంచి మాటలను విందురు. వారియొక్క బుద్ధిలో ఆ మంచిపలుకులు బాగుగా నాటునట్లు బోధింపవలయును. అట్లు బోధించువారు చాల అల్పసంఖ్యాకులే. ధర్మోపదేశ మొనర్చువా రొక ప్రయోజనము నెదురుచూడక యుండవలయును. అప్పుడే వారి యుపదేశములకు విలువ యెక్కుడుగనుండును. ప్రజలను రక్షించుటకు, పోలీసును వృద్ధిచేయుటకు బదులుగా ఆత్మజ్ఞానులను వృద్ధిపఱుపవలయును. దుష్కృత్యములు చేయరాదని బుద్ధిని గలిగింపఁదగినవారి సంఖ్య నధికపరుచుటకై రాజ్యాంగమువారు ప్రయత్నింపవలయును. ఆస్పత్రులలో వ్యాధిగ్రస్థులకు వైద్యముచేయఁబడును. వ్యాధుల దగ్గఱ చేరనీయకయే జాగ్రత్తగా నుండుపక్షమున, ఆస్పత్రుల యవశ్య మేర్పడదు, అట్లే, కామమువలన ప్రయోజనము లేదు. కోపము సర్వాపదల దెచ్చుననెడి యభిప్రాయముల నందఱికి బాగుగా తెలియునట్లొనర్చినయెడల, రాజ్యాంగము వారికి పనియు, కర్చును, చాలవఱకు తగ్గును. అట్లొనర్చుటకు ధర్మజ్ఞు లధికముగా కావలయును. ధర్మముగా పరిపాలించెడు రాజ్యాంగమున కెన్నటికిని చెఱుపు రానేరదు.

## —: అపరాధము—శిక్ష :—

శిక్షయొనర్చుట యొక తప్పగు కార్యమే. అది యితరులను, హింసాపాత్రుల చేయుటయే యగును. ఒకఁడు మఱొకని హింసించెనని, వానిని మనము శిక్షించెదము. వాఁడు చేసిన దొక పాపము. వానిని మనము శిక్షించుట మఱొక దోషము. ఒకఁ డొక తప్పొనర్చిన వానిని కారాగృహమం దుంచెదము. ఇది ఏల? వానిని విచ్చలవిడిగా వదలివేసితిమేని, వాఁడు ప్రతిదినమును ఎవరికైనను కష్టమును కలిగించుచునే యుండును. వానిని జైలులో నుంచిన పక్షమున, లోకములో అనేకజనులకు హింస తగ్గును. వాఁడు తా నొనర్చినపని దుష్కృత్యమని తలఁచెనేని వానిని శిక్షింప నవసరములేదు. ఎంతెంత తక్కువ హింసచేత దుష్టులను సన్మార్గమునకుఁ ద్రిప్పనగునో యదియే శిక్ష. ఇతరుల కేవిధమగు కష్టములను గలుగచేయ నియ్యక, యందఱిని సన్మార్గమందు ప్రవర్తింపచేసి, ప్రజలను శాంతమగుదారికి తెచ్చుటకు కావలసిన యుపదేశమును జేయఁదగినది యర్థశాస్త్రము. చట్టముల జేయుట మాత్రమే రాజ్యాంగముయొక్క పనిగాదు. సద్బుద్ధిని ఉపదేశము జేయగల ఆత్మజ్ఞానులను వృద్ధిపఱచుటయు వారియొక్క కర్తవ్యమే. పూర్వమం దొకజాతియం దొకఁడు దుష్కృత్యము సలిపినయెడల ఆ జాతియందలి, పెద్దలే వానిని సన్మార్గమునకు తెచ్చుచుండు పద్ధతి ఉండినది. జాతి కట్టుపాటుండినయెడల రాజునకు పని చాలతగ్గును. ఇట్టి జాతికట్టుబాటు దుర్మార్గమును అణఁచివేయును. పూ

ర్వపురాజు లెల్లరును, దేవాలయప్రతిష్ఠ, గుంటలను, బావు లను త్రవ్వించుట యిత్యాదికార్యముల చేయుచుండిరి. పూర్వము జనులు విశేషముగా దేవాలయములకుఁజని, ఈశ్వర దర్శనముచేసి సకల శ్రేయస్సులను బొందుచుండిరి. ఇప్పుడన్ననో దేవాలయములు కట్టునట్టి పనిలేదు. కోర్టు లధికము లైనవి. జనులు పోనందున కొన్ని గుళ్లు పాడుపడిపోయినవి. జనులు, క్లబ్బులకును, హోటళ్లకును విశేషముగావెళ్లి, చేయరాని పనులు చేయుచు, తినరాని వస్తువుల తినుచు, కామమును వృద్ధిచేసికొనుచు సకలకష్టములకు పాలగుచున్నారు. జనులు దేవాలయములకుఁ బోయి మనశ్శాంతిని బొందుటలేదు. వారి భక్తిని ఆ పరమేశ్వరునియం దర్పణ చేయుట తగ్గిపోయెను. ఈశ్వరునికి వారి భక్తిని చెల్లించి సద్గతికి దారివెదకుట వదలి వృథాయుక్తులను, సందేహములను, దెచ్చుకొని, వృథావిషయములయందు బుద్ధినుంచి, శ్రమపడుచున్నారు. భక్తి కలిగిన పక్షమున జనులకు సందేహములును, కుయుక్తులును కలుగఁజాలవు. సకల జనుల మనస్సును శాంతపఱచునది యర్థశాస్త్రము. వేదములందు చెప్పియుండెడి సత్యములను జనుల మనస్సులందు బాగుగా నాటునట్లు చేయఁదగిన పెద్దలను, వృద్ధి చేయవలయును. అట్లు చేయఁదగిన మహాత్ములను పిలిచికొనివచ్చి వారల పూజింపవలయును. ఇదిగాక పూర్వము మన రాజులందఱు అడవులలోనుండిన ఋష్యాదులయొద్దకుఁ బోయి, వారి పాదములకు మ్రొక్కి వారల రాజ్యంబులకుఁ దోడ్కొనిపోయిన విషయ

ముల మనము చదువుచున్నాము. ఆహారము, గృహము, వస్త్రము, మానము, వీనిని రక్షించుటకై అర్థశాస్త్ర మేర్పడియున్నది. అంతేకాక మన దేశమునందలి దుష్టులును, ఇతర దేశములందలి శత్రువులును, మనలను హింసింపకుండునటుల చేయుచున్నది. అందులకై సామ, దాన, భేద, దండోపాయములు కలిగియున్నవి. అట్టి యర్థశాస్త్రమునందు చెప్పఁబడు రీతిగా అందఱు సన్మార్గమందు ప్రవర్తించి భక్తియుక్తులై పరమేశ్వరుని కృపకు పాత్రులు కావలయును.

---

## —: ధనుర్వేదము :—

సామ, దాన, భేద, దండోపాయంబులలో కడపటిది యగు దండోపాయంబును విస్తారముగా నుపయోగించునది ధనుర్వేదము. మొదటి మూఁడుపాయములతో మనము శత్రువును జయింపలేని పక్షమున కడపటి యుపాయమును ఉపయోగపఱచి వానిని దారికి తేవలయునే కాని మొట్టమొదటనే దండోపాయంబు నుపయోగింపరాదు.

అందఱు అన్నిపనులను జేయుటకు వీలులేదు. ధనుర్బాణంబులఁ గైకొని, ధనుర్వేదము నాచరించుట కధికారము క్షత్రియులకు మాత్రమే కలదు. ఇట్టి ధనుర్వేదమును బ్రాహ్మణుల యొద్దనే వారు నేర్చుకొనవలయును. బ్రాహ్మణులు, వేదముల ద్వారా సకల కార్యములను 18 విద్యలను తెలిసికొనుచుకొని, యా యా పనుల కధికారులగు ఆ యావర్ణస్థులకు ఆ యా విద్యల నుపదేశ మొనర్చి వారలకు జ్ఞానమును

కలుగచేసి వారు వా రిచ్చెడి గురుదక్షిణను బుచ్చుకొని జీవనము చేయవలయును. ఇంతేకాని బ్రాహ్మణుడు ధనుస్సును గైకొని బాణప్రయోగ మొనర్పరాదు. ధనుర్వేదమును, క్షత్రియునకు బ్రాహ్మణుడే నేర్పింపవలయును. మన దేశమం దనేక విధకార్యములు జేయుట కనేకజాతు లేర్పడియున్నవి. అందుచేతనే వసిష్ఠులు, ధనుర్వేదమును పరిపూర్తిగా గు ర్తెఱిగియున్నప్పటికిని వారెచ్చటను బాణప్రయోగంబుల జేయలేదు. శ్రీరాములవారి కావిద్యను బహువిమర్శగా నేర్పిరి. విశ్వామిత్రుడును, శ్రీరామునికి కొన్ని బాణప్రయోగంబుల నుపదేశించెను. కాని వారు తాటక అడ్డగించినప్పుడును మారీచ సుబాహులవలన కష్టము గలిగినపుడును శ్రీరాముని బాణప్రయోగ మొనర్పుమనిరే కాని, తాముగా నట్టి పనిని చేయలేదు.

ధనుర్వేదమందు చెప్పియుండెడి యాయుధ విశేషములలో, అస్త్రమనియు, శస్త్రమనియు రెండువిధములు. దేహశుద్ధితో, మంత్రిశక్తిచే వదలునట్టిది అస్త్రమనఁబడును. సరియైన యుచ్చారణతో ఒక మంత్రమును పఠించుచు ఒక దర్భను ప్రయోగమొనర్చినను చాలును. పాశుపతాస్త్రము, బ్రహ్మాస్త్రము, నారాయణాస్త్రము, నాగాస్త్రము మొదలగునవి ఉదాహరణములు. చేతియం దుంచుకొనియే యుపయోగించెడి యాయుధములకు శస్త్రము లనిపేరు. శస్త్రములలో, ముక్తం, అముక్తం, ముక్తాముక్తమని యనేక భేదములు గలవు. మనచేతినుంచి యొకవస్తువును వదలి యిత

రులను హింసించునది ముక్త మనఁబడును. గుండు వేయుట, బాణము వేయుట, రాతిని విసరుట, యిత్యాదులు ముక్తమున కుదాహరణములు. మన చేతిలోనే యుంచుకొని యితరులను శిక్షించుటకు ప్రయత్నించునది యముక్త మనఁబడును. కత్తి నుదాహరణముగా చెప్పవచ్చును. కొన్ని యాయుధములు మనచేతినుండి వెడలి, యెదిరిని శిక్షించినపిదప మఱల మనచేతికి తిరిగివచ్చి చేరెడు యాయుధవిశేషమునకు అముక్తాముక్త మనిపేరు. ఇదిగాక, గరుడవ్యూహము, అశ్వవ్యూహము మొదలగునవి ధనుర్వేదములో చేరినవి. రథగజతురగ పదాతుల నానా స్థలములలో నుంచి, యీ రీతిగా యుద్ధము చేసినయెడల శత్రువును జయింపవచ్చు ననెడి నిబంధనలను ధనుర్వేదము చక్కఁగా తెలియఁ జెప్పుచున్నది. ఇదిగాక యొక వ్యూహమును భేదించి లోపలవెళ్లుటకుఁగాని, యొకవ్యూహములో తగులుకొనిన పక్షమున తప్పించుకొనుటకును ధనుర్వేదము దారిచెప్పును.

తన కుటుంబమును, ఆత్మను రక్షించుటకై ప్రతి మనుజుఁడును విలువిద్యను ముఖ్యముగా నేర్చికొని యుండవలయును. అట్టి ధనుర్విద్యను బ్రాహ్మణుఁడు ఉపదేశ మొసఁగుటకును, క్షత్రియులు నేర్చికొని యాచరించుటకును తగినవారని మనశాస్త్రము వక్కాణించుచున్నది.

---

## —: గాంధర్వ వేదము :—

గాంధర్వవేద మనునది యొక ఉపవేదము. ఇయ్యుప వేదము మనస్సున కుత్సాహమును గలుగజేయును. ఒకనాటకమునకు వెళ్ళిచూచుటచేత కన్నులకు సంతోషము కలుగును పాట కచ్చేరికి పోవుటచేత చెవులకు సంతోషము పుట్టును. కాని కడుపు నిండదు, ఆఁకలి తీఱదు.

చిత్రములువ్రాయుట, సంగీతము పాడుట, నర్తనము చేయుట, కవిత్వము చెప్పుట, అష్టావధాన శతావధానములు చేయుట, బాడ్మింటన్ అనెడి చెండాట, సినిమాలు మున్నగునవి యన్నియు గాంధర్వవేదములో రాఁగలవు. ఇదిగాక యరువదినాలుగు చిత్రకళలుకూడ గాంధర్వవేదములో చేరినవే. ఇట్టివానియందు ప్రియముంచి, చాల విశేషముగా నభ్యసించువారు గంధర్వులని యొక జాతివారుగలరు. వీరు మన కంటికి కాన్పింపకయే సంచరింతురు. అయితే వీరిని దివ్యచక్షుస్సుతో చూడఁగలము. ఎది యెట్లనఁగా? మనసాధారణ నేత్రములతో చూడలేని వస్తువులను భూతద్దము క్రింద నుంచి చూచినట్టయితే బాగుగా తెలియును. ఎక్స్‌రే యనెడి కిరణములతో దేహము లోపలనుండు దానిని చూచుచున్నాము. అట్లే దివ్యచక్షుస్సుతో గంధర్వులను మనము చూడఁగలము. ఇంద్రియ విషయములలో వీరికి ప్రియ మెక్కువ.

ఉపవేదములలో కడపటిదియగు ఈ గాంధర్వవేదము, నృత్తమనియు, గీతమనియు, వాద్యమనియు మూఁడు భేద

ములు గలదిగా నున్నది. నర్తనమనునది కరచరణాదుల నాడించుటచేత యితరులకు మన భావమును దెల్పుట. నర్తనమనునది రెండు భేదములుగలది. అది తాండవమనియు, లాస్యమనియు ద్వివిధములు. పురుషనృత్యమునకు తాండవమనియు, స్త్రీనృత్యమునకు లాస్యమనియు పేరులు. అందుచేతనే ఈశ్వరునికి తాండవమూర్తియనియు అంబికకు లాస్యమూర్తియనియు నామంబులుకలవు. ఇఁక గీతమును గుఱించి తెలిసికొందము. మనకంఠమునుండి వెలువడెడి శబ్దములను సప్త స్వరములుగా విభజించి యా యా స్థలములలో ఆయా స్వరముల మార్చియుంచి, కల్గించెడు ధ్వనికి గీతమనిపేరు. ఒకవిధమగు స్వరముల మార్పువలన సంతోషమును కలిగించెడు సంగీతమగును. మఱియొక విధమగు స్వరముల మార్పువలన దుఃఖము నుత్పాదించును. చిత్రపు పనులు చేయువాఁడొక చిత్రము వ్రాసినయెడల చాల బాగుగ నుండును. ఆపని తెలియనివారు చిత్రమువ్రాసినేని బాగుగా కనుపించదు. అట్లే కవిత్వమును, సంగీతమును ఆ యా విద్యలందు నేర్పరులగువారు చేయఁదగినవై యున్నవి. వాద్యమనునది, వెలుపలనుండు కొన్ని సాధనముల మూలకముగా శబ్దమును గలుగఁజేసి, సంతోషమును పుట్టించును. వాద్యములలో ననేకవిధములు గలవు. చర్మవాద్యము, తంత్రీవాద్యము, లోహవాద్యము, రంధ్రవాద్యము, మొదలగునవి. వీణె, తంబుర మొదలగునవి తంత్రీవాద్యములు. తాళములు, మోర్సింగు యిత్యాదులు లోహవాద్యములు ; పిల్లనగ్రోవి,

నాగస్వరం మొదలగునవి రంధ్రవాద్యములు; డోలు, మద్దెల యిత్యాదులు చర్మవాద్యములు. అభిఘాత్య మనఁగా దెబ్బ యిచ్చుటచేత మ్రోఁగునది. ఇట్టులే చర్మవాద్యములును, స్పర్శవల్ల తంత్రీవాద్యములును, శబ్దంబుల వెలిబుచ్చును. తంత్రీవాద్యములో అనుసారణి యని కలదు. అ దేమనఁగా ఒక తంతిలో నొకశబ్దమును గలుగజేసి, దానినే చాలకాల ముంచుకొని దానిలో ననేక శబ్దములు కలుగఁజేయుట.

ఈ వాద్యముల నుపయోగపఱచుటకును, నాటకము లలో వేషము వేయుటకును భారత పుత్త్రిలనువారు మాత్ర మే యధికారులు. పూర్వకాలములో బ్రాహ్మణులు, నాట కములందు వేషము వేయుటలేదు. భరతపుత్త్రిలును, స్త్రీ పురుషులు మాత్రమే పాత్రల ధరించుచుండిరి. పురుషుఁడు స్త్రీ వేషమును ధరించినను, స్త్రీ పురుష వేషమును ధరించినను, చూడరాదనియు, బ్రాహ్మణుఁడు నాటకములో వేషము వేయుటను చూడరాదనియు, అటు చూచినయెడల ప్రాయ శ్చిత్తము చేసికొనవలయు ననియు ధర్మశాస్త్రము చెప్పు చున్నది. రామనాటకమాఁడు పక్షమున శ్రీరాముల పాత్ర ధరించువాని భార్యయే సీతవేషమును ధరింప వలయును. పూర్వ మా యా జాతి,ఆ యా వృత్తి నవలంబించు చుండినది. సకలవిద్యలు బ్రాహ్మణుఁ డెరిగియుండవలెనే కాని వాని నతఁడు చేయరాదు. బ్రాహ్మణులగు వా రా యా యధికారి కా యా విద్య నుపదేశింపవలయును. తన జీవనమునకై గురు దక్షిణను పొంది కాలక్షేప మొనర్పవలయును. రాజ్యాం

గమువారు శ్రోత్రియము లిచ్చియుండు పక్షమున, వాని ఫలి తము ననుభవించుచు ఇతరులకు విద్యను, ప్రతిగ్రహము లేక యే బోధింప వచ్చును.

మన యాది శంకరాచార్యులవారు సర్వజ్ఞ పీఠంబు నధిష్ఠించు నప్పుడొక మాదిగవాఁడు వారియొద్దకు వెళ్లి 'స్వామి, తమరికి చెప్పులుకుట్టు వృత్తి తెలియునా ?' యని ప్రశ్నించెనఁట. అందుల కాచార్యులు, చెప్పులు కుట్టెడు సూది నెత్తుకొని, రెండుమూర్లు తన ముక్కుపై రాచి, పిదప కుట్టుటకు ప్రారంభింపఁగా, ఆ మాదిగ 'స్వామి ! చాలును మన్నింపుఁడు. తమ కన్నివిద్యలు తెలియు' నని చెప్పి వెళ్లి నాఁడఁట. అట్లె బ్రాహ్మణుఁ డన్ని విద్య లెఱింగియుండవల యును. ప్రతివారును వారివారి వర్ణాశ్రమధర్మము లాచరించు చుండవలయును. కేవలము పాశ్చాత్య ధర్మముల నాచరిం చుటయందే మనము కంకణము కట్టుకొనరాదు. ఈ కాల మందు, బడికి పిల్లవాఁడు పోఁగానే, కాఫీ త్రాగుటయు, తల వెంట్రుకలు కత్తరించుకొనుటయు, నేర్చికొను చున్నాఁడు. పూర్వకాలమందు పెద్దలు కష్టపడి సంపాదించిన భూములు, మున్నగువాని నమ్మివైచి, ఆ యాస్తినంతయు నేఁటి విద్యార్థి యొక సర్టిఫికేటుగా చేయుచున్నాఁడు. స్వరాజ్యమును పొం దుటకు జాతివారివలె మనము మన యాచారాదుల మఱచి త్రాపు చేసికోవలయునా ? 'ఒక కుళ్లాయిల వ్యాపారి యొక కుళ్లాయిల మూఁట నెత్తికొని యొక వృక్షముక్రింద శ్రమ తీర్చుకొనుటకై పరుండెను. అప్పు డా చెట్టునందలి కోఁతు

లన్నియు దిగివచ్చి యొక్కొక్కటి యొక్కొక్క కుళ్లాయిని తలకు దగిలించికొని చెట్టుపైకి వెళ్లెను. వ్యాపారి నిద్రలేచి చాల చింతించి తన తలలోని కుళ్లాయినిదీసి 'దీనినికూడ దీసికొని పొండని' విసరివేయఁగా నవియన్నియు యట్లే కుళ్లాయీలను నేలపై వేసెనని యొక కథ కలదు. ప్రస్తుతము మన స్థితియు నిట్లే యున్నది. సుమారు 1000 సంవత్సరములకు ముందు ముసల్మాను రాజులు మన దేశము నేలుచుండిరి. వారు గడ్డమును పెంచుకొనుచుండిరి. మన దేశములోని యీ ముసల్మానుల వలె మనము గడ్డమును పెంచుటకు యత్నింపలేదు కదా! జాతివారెన్నడైనను మనకు క్రాపుచేసికొనుఁడని యుపదేశించిరా? లేదు. కాని, యిందులకు మన బుద్ధియే కారణము. మనము మన పెద్దలవలె ధర్మశాస్త్రముల పరిశీలింపవలయును. ఇతర దేశీయులు మన మార్గముల నాచరించునట్లు చేవలయునే కాని, మనము వారివలె నుండుట యుచితము కాదు. మన మెల్లరమును ధర్మమార్గమున ప్రవర్తించి మన స్వాతంత్ర్యమును వృద్ధిచేసికొనుట కాప మేరశ్వరుని ప్రార్థించుచు ఇతర మతస్థులఁజూచి 'యయ్యలారా! మేము మా ధర్మానుష్ఠానాదులుచేసి సుఖింపుచున్నాము. మీరును మీ మతమునకు సంబంధించిన ధర్మంబు లాచరించి సుఖియింపుఁ' డని చెప్పవలయును.

'లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.'

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ చెన్నపురి, ఏకామ్రేశ్వరాగ్రహారమునకు శ్రీ వారు దయచేసినపుడు భిక్షలు, పాదపూజలు, మున్నగు కైంకర్యములు జరిపిన ధన్యాత్ముల పట్టిక.

| తేదులు | పేర్లు. |
|---|---|
| 28-9-32 | శ్రీ వారు నగరి బుగ్గనుండి చెన్నపురికి వచ్చినపుడు మొట్టమొదటనే ఠాకరు సత్రమున స్వాగతమిచ్చి శ్రీయుతులు, రంగనాథ దవే, కృష్ణజీ దవేగారు భిక్ష జరిపిరి. శ్రీవారు తర్వాత కొంతకాలము మైలాపూరులో నుండిరి. |
| 14-12-32 | గుజరాతి ఖేడాబ్రాహ్మణ సాముదాయక భిక్ష. అష్టోత్తరశతము. పాదపూజ. |
| 16-12-32 | శ్రీయుతులు. లాల్ దాసు, బాబుదాసుగారు (పరమానంద దాసు, ఛోటాదాసు కంపెనీవారు) భిక్షయును పాదపూజయును జరిపిరి. త్రిశతి. |
| 17-12-32 | ,, పురుషోత్తమదాసు, గోకుల్ దాసుగారు (గోకుల్ దాసు, జమ్నాదాసు కంపెనీవారు) త్రిశతి పాదపూజయును, భిక్షయును జరిపిరి. |
| 18-12-32 | ,, టి. బి. మెహతా అందు సన్సు వారు. భిక్ష, త్రిశతి పాదపూజయును జరిపిరి. |
| 19-12-32 | ,, టి. ఆర్. జోషీ అందు సన్సు వారు. భిక్ష, అష్టోత్తరశతము పాదపూజయును, జరిపిరి. |

| తేదులు | పేర్లు. |
| --- | --- |
| 20-12-32 | శ్రీయుతులు గులాబ్ దాసు, నారాయణదాసు గారి భిక్ష. |
| 21-12-32 | ,, ఖేడా బ్రాహ్మణ సాముదాయకభిక్ష.(రెండవది) |
| 22-12-32 | ,, టి. సుందరేశ్వరజోషీ, టి, భవానిశంకరజోషీ గార్ల, భిక్ష. త్రిశతి పాదపూజ. |
| 23-12-32 | ఏకాదశీ శుక్రవారము. కనుక సువాసినీ పూజ, రాత్రి శ్రీ చంద్రమౌళీశ్వరస్వామి వారికిని, అమ్మవారికిని అభిషేకపూజాదికము. (శ్రీ). టి. బి. మెహతా అందు సన్నువారు మిక్కిలి విభవముగ జరిపిరి. |
| 214-2-32 | ,, టి. లక్ష్మీశంకరదెవే, వేంకటేశ్వరదెవే గార్ల భిక్ష. అష్టోత్తరశతము పాదపూజ. |
| 25-12-32 | ,, కాశీరాం తరవాడీగారి భిక్ష, అష్టోత్తరశతము పాదపూజ. |
| 26-12-32 | ,, అసిస్టెంటు ఇన్ కంటాక్సు ఆఫీసరు, యస్. నానాభాయిదెవే గారి భిక్ష. అష్టోత్తరశతము పాదపూజ. |
| 27-12-32 | ,, లల్లూభాయి, హకంచంద్ గారి భిక్ష. అష్టోత్తరశతము పాదపూజ. |
| 28-12-32 | ,, ఘూర్జర ఖేడాబ్రాహ్మణ సాముదాయక భిక్ష (మూఁడవది.) |

| తేదులు | పేర్లు. |
|---|---|
| 29-12-32 | శ్రీయుతులు. మోహన్‌లాల్, కన్యాలాల్, రామనాథ గోయంకగార్ల భిక్ష. అష్టోత్తరశతము పాదపూజ. |
| 30-12-32 | ,, ఘూర్జర సుమంగలి స్త్రీల భిక్ష. |
| 31-12-32 | ,, గోపాలదాసు, ఘనశ్యామదాసు వారి భిక్ష. |
| | (ఘనశ్యామదాసు, శిరోమణిదాసు అండు కంపెనీ వారు) |
| 1-1-33 | శ్రీ వారు పురశవాకమున మకాంచేసిరి. |
| 2-1-33 | శ్రీయుతులు, టి. శివశంకర ఠాకరు వారి భిక్ష. అష్టోత్తరశతము పాదపూజ. |
| 16-12-32 | ,, సాహుకారుపేట నూలువ్యాపారస్థులు, వెండి దీపస్తంభము, అష్టోత్తరశతము, పాదపూజ. |
| 17-12-32 | ,, చతుర్భుజదాసు, కుశాల్‌దాసు అండు కంపెనీ వారు సమర్పించిన పాదకానుక రూపాయలు 150-0-0. |
| 18-12-32 | 1. శ్రీయుతులు, టి. బి. మెహతా అండు సన్సు వారిచే శ్రీస్వామి, అమ్మవార్ల, పూజానివేదనములకు రెండు అడుకుపాత్రలు సుమారు రూ. 700-0-0 వెల చేయఁగలవి సమర్పింపఁబడినవి. |

| తేదులు | పేర్లు. |
|---|---|
| | 2. శ్రీ వారి పూజానిమిత్తము, అభిషేకపాత్రలు దీపస్తంభము, రజతపేటిక, సుమారు ర్పూ॥ 500-0-0 వెల చేయఁగలవి సమర్పింపఁబడినవి. |
| | 3. ఘూర్జర బ్రాహ్మణబాలురు సుమారు ర్పూ. 200-0-0 వఱకు వసూలుచేసి శ్రీ చంద్రమౌళీశ్వర స్వామివారికి, నవరత్నహారమును సమర్పించిరి. |
| | 4. ఘూర్జర బ్రాహ్మణకన్యకలు, ఒక స్వర్ణ చంపక పుష్పమును శ్రీ అమ్మవారికి సమర్పించిరి. |
| | హిందూతిలాజికలు హైస్కూలు ధర్మకర్తలు త్రిశతి పాదపూజచేసిరి. |
| 25-12-32. | బి. శివశంకర దేవేగారు, అష్టోత్తరశతము. |
| ,, | కృష్ణాబాయిగారు, ,, |
| 26-12-32. | ఎన్. మణిశంకర దేవీగారు, ,, |
| 2-1-33. | టి. బాలకృష్ణ మెహతాగారు, ,, |
| | టి. రంగనాథ మెతాహగారు, ,, |
| | శ్రీ. టి. రామనాథ మెహతాగారు, శ్వేతఛత్రమును సమర్పించిరి. |

శ్రీ. టి. బి. మెహతా అండు సన్సు వారు శ్రీ వారి పరివారమున కంతకును దోవతుల చాపుల నిప్పించి, బహూక

రించిరి. ఇంకను, అనేకులు వారి వారికి తోఁచిన పూజసామ
గ్రిని, స్వర్ణ, రజత, భూషణాదులను, శ్రీ చంద్రమౌళీశ్వర
స్వామివారికి సమర్పించిరి.

ఓం, తత్సత్.

—

1933 జనవరి 2-వ తేది రాత్రి పది గంటలకు శ్రీ వారు
సపరివారముగ పురశొవాకమునకు విజయము చేసిరి.

కేసరీ ముద్రాక్షరశాల, చెన్నపురి.



శ్రీస్వాములవారి మఱియొక ఛాయాచిత్రము.

శ్రీవారు ఏకామ్రేశ్వ రాగ్రహారమునుండి బయలుదేరి
వెళ్లునపుడు, అఖిల ఘూర్జర బ్రాహ్మణ బృందము తరపున,
శ్రీ. కే. సుబ్బరాయ తరవాడీగారు చదివి సమర్పించిన
విజ్ఞప్తులు పత్రము.

ॐ

# શ્રી શારદામ્બા વિજયતે.



શ્રીમત્ પરમહંસ પરિવ્રાજકાચાર્ય વર્ય જગદ્ગુરૂ શ્રી શંકર ભગવત્પાદ પ્રતિષ્ઠિત શ્રી કાંચી કામ કોટિ પીઠાધિપતી શ્રીમદ્ જગદ્ગુરૂ શ્રી ૧૧૦૮ ચંદ્રશેખરેંદ્ર સરસ્વતિ ચરણાર્વિંદની પવિત્ર સેવામાં.

સ્વારી શ્રી મદ્રાસ.

પરમ પુજ્યપાદ આચાર્યવર્યજી.

આજથી આશરે ૧૧૦૦ વર્ષ પુર્વે અમારા પુર્વજો તામ્રવાર્ણી તટસ્ત (તીનેવલ્લી) દક્ષિણ પ્રદેશથી યાત્રા નિમિત્તે પ્રભાસપાટણ તરફ થઇ ખેડા અને ઇડર તરફ ગયા હતા તે સમયે ગુજરાતમાં રાજા મયુરધ્વજે પુત્રેષ્ટિ યજ્ઞ આદરેલ હતો તે પ્રસંગમાં સુવર્ણ ગૌદાન કરવાનો નિશ્ચય કરેલ હતો.

આ નિશ્ચયની પુર્તિની ઠરાવમાં આવું દાન અમારા પુર્વજોને લેવાનો આગ્રહ કર્યો પણ તેઓએ તે દાન ગ્રહણ કરવાની ઇચ્છા ન કરવાતી રાજા ક્રોધિત થઇ બળાત્કાર કરવા લાગ્યો અને અમારા પુર્વજોને સુવર્ણગૌદાન સ્વિકારવાની મરજી ન હોવાથી આ ગામ મુકી ચાલી નીકલ્યા.

પાછલથી આ હકીકત તે રાજાની રાણીને જાણ થતાં રાણીએ પોતાના પિતાદ્વારા તેઓનો સત્કાર કરી જાગીરમાં ગામો અપાવ્યાં. ત્યારથી અમારા પુર્વજો શ્રી નર્મદાના પવિત્ર તટની આસ પાસ વસી રહ્યા.

અમો (ખેડામાંથી નીકળી ગયા તેથી) બાજ ખેડાવાળ બ્રાહ્મણોના અભિધાને ઓલખાયા અને તેઓની ધાર્મિક અને વ્યાપારી વૃત્તીને અનુસરી દ્વિવેદી (બેવેદને જાણનારા) ત્રિવેદી, (ત્રણવેદને જાણનાર) જોશી ભટ, મહેતા, ઠાકર, શુકલ, વિગેરે ઉપનામ (અટક) થી ઓળખાવા લાગ્યા.

તદનંતર આશરે ૩૦૦ થી ૪૦૦ વર્ષ પહિલાં મુસલમાનોના આક્રમણ અને ત્રાસથી સ્વસ્થાન તજી વેહવાર નિમિત્તથી દક્ષિણમાં હૈદ્રાબાદ, આરકાટ, મૈસુર, તિરૂપતી, ચીદમબરમ, કુંબકોનમ, તંજાવર, ત્રીચીનાંપલ્લી, તીનેવલ્લી, તીરૂવાંદ્રમ, વિગેરે સ્થળોમાં વસવાટ કરવા લાગ્યાં જે પ્રદેશ આપ શ્રીનો પવિત્ર પ્રદેશ હોવાથી અમારામાં આપ શ્રીની કૃપાથી ધાર્મિક સંસ્કારો અદ્યાપિ પર્યંત અવિછીન્ન રહ્યા.

હાલમાં આપ શ્રી સ્વસ્તાન છોડી આશરે ચૌદ વર્ષ થયા હિંદુ ધર્મના સંરક્ષણાર્થે પ્રવાસ દરમ્યાન સ્થળે સ્થળે મુકામ કરી આપ શ્રીની સેવક વર્ગને ધર્મનું રહસ્ય સમજાવી આધુનિક ઉત્ક્રાન્તિના સમયને અનુકુલ અનુભવી પ્રવચનો ઉપન્નાસાદિકથી વાર્ણાશ્રમ ધર્મને સુદ્રઢકરવા પ્રવૃતિ કરી રહ્યા છો.

આપનાં આ અત્યુત્તમ પ્રયાણ સમયે અમો આપના શિષ્ય વર્ગોની નમ્ર વિનંતી શ્રવણ કરી અને અમારા ઉપર અત્યંત અનુગ્રહથી તેનો સ્વિકાર કરી આપ શ્રી ચેન્નપુરી મદ્રેયેના અમારા નિવાસસ્થાન ગુજરાતી સત્તા મધ્યે પધારી અલ્પ સમય માટેનો વિશ્રામકરી આપશ્રીએ સદ્દશાસ્ત્રો અને તેના રહસ્યોના ઉપદેશરૂપી વચનામૃતથી અમારા કર્ણ પુટમાં જે ભક્તિરસ રેડયો તેથી અમોને થએલ પરમાનંદનું વર્ણન કરવા અમારી જીહ્વા સર્વથા અસમર્થ છે.

છંદ—હરીગીત.

જ્ઞાનોપદેશ પ્રકાશ રવિથી, પ્રભુ તિમિર ભાગી ગયું
વચનામૃતો અનુપાન થી, અમ હૃદય સ્થળ નિર્મળ થયું
સત્સંગને દર્શન થકી, આલ્હાદ ઉર વાધ્યો અતી
કરૂણાળુ છો નિજ જનપરે શશી, શેખરેંદ્ર સરસ્વતિ.

આવી આવી આપની અનેક પ્રકારની ધર્મધુરંધરતા અને ધર્મ રક્ષકતાને લઇને આપ શ્રીને અમો સહસ્ત્રવંદન પુર્વક આ માન પત્ર અર્પણ કરવાની આજ્ઞા માંગીએ છીએ.

અમો છીએ.
આપના શરણાંગત સેવકો

**શ્રી મદ્રાસમાં વસતા બાજ ખેડાવાળ બ્રાહ્મણોના**
**સાષ્ટાંગ દંડવત પ્રણામ અંગીકાર કરશોજી.**



WITH THE GUIDANCE

ESTEEMED HELP AND ADVICE OF

# H. H. The JAGADGURU

# Sri Sankaracharya Swami

OF KANCHI KAMAKOTI PEETAM

DURING HIS STAY IN THE

## Ekambareswara Agraharam.



A Central Committee has been formed under the name of **The Hindu Central Committee, Madras, on 30th December 1932,** for the purpose of—

1. Preserving the true Hindu Religion and culture as laid down in our Shastras and traditionally interpreted and followed through immemorial ages.

2. Looking after the real needs and promoting the welfare of all the communities comprising the Hindu Society in consonance with Shastras.

---

**MEMBERS.**

(1) V. V. Srinivasa Iyengar,
*Ex-Judge, Madras High Court.*

(2) Dewan Bahadur
V. Masilamani Pillai,
*Ex-Judge, Madras High Court*

(3) Dewan Bahadur
Govindoss Chathoorbhoojadoss,
*Ex-Sheriff of Madras.*

(4) Dewan Bahadur,
L. A. Govindaraghava Iyer,
*Advocate, Madras*

(5) Rao Sahib,
C. Rajaratnam Mudaliar,
*Retd. I. A. S. C., Madras.*

(6) T. N. Athmaram Mahadick Rao Sahib,
*Huzur Mahadi Palace, Tanjore.*

(7) Purushotthamdoss Gokuldoss,
*Banker and Merchant, Madras.*

(8) Sriramulu Naidu,
*Municipal Councillor & Dubash, Madras.*

(9) P. Balasundaram Chetty,
*Cashier, Mercantile Bank, Madras.*

(10) K. Balasubramaniya Iyer,
*Advocate, Madras.*

(11) Mahamahopadyaya Krishna Sastrigal,
*Principal, Sanskrit College, Madras.*

(12) Nannu Sanker Tawker,

*Surajmal, Lallubhai & Co., Madras.*

(13) Kissendoss Girdherdoss,

*Banker & Merchant, Madras.*

(14) T. Ranganatha Mehta,

*Partner, Messrs. T. B. Mehta & Sons., Madras.*

---

T. RANGANATHA MEHTA,

*Honorary Treasurer.*

KISSENDOSS GIRDHERDOSS,
NANNU SANKER TAWKER,

*Honorary Secretaries.*

---

HADDON & CO., PRINTERS, MADRAS.